నవరచనావళి : 3



# చిత్రాంగద

శ్రీ రవీంద్రనాథ ఠాకూర్



అనువాదకుడు :

మల్లవరపు విశ్వేశ్వరరావు

వెల : 1—8—0

నవరచనావళి: 3



# చిత్రాంగద

శ్రీ రవీంద్రుని వంగమాతృకకు అనువాదం



అనువాదకుడు:



మల్లవరపు విశ్వేశ్వరరావు





ప్రథమముద్రణం 1947

వెల: రు. 1-8-0



# అంకితం

జీవనయాత్రలో సహధర్మిణి

## చి. సౌ. విజయలక్ష్మికి

—అనువాదకుడు.



## అనువాద విషయం

"చిత్రాంగద" నాటిక వంగభాషలో Blank Verse అనే ఛందస్సున వ్రాయబడినది. పాదమునకు 14 అక్షరములు. పాదాంతాన్ని పదము పూర్తికావాలి. 6-వ అక్షరము పిదపగాని, 8-వ అక్షరము పిదపగాని విరామము ఉంటుంది. మూలములోని పాదములు అక్కడక్కడ ఏరుకొని, ఒకటిరెండు అక్షరములు ఎక్కువ తక్కువలు చేసి చదివితే మన తేటగీతికి సరిపోవడం కద్దు. అది గమనించి, ఈ అనువాదం తేటగీతిలో-యతినియమం తొలగించి—జరిగింది. మూలములోని Blank Verse ఛందస్సు వంగీయుల ఉచ్చారణను బట్టి గణవిభజన చేస్తే ఒకవేళ మన గీతానికి సరిపోగలదేమో అని అనుమానం! ఈ అనువాదంలో మూలంలోని సంస్కృతశయ్యయే నూటికి 80 పాళ్లు ప్రయోగించబడినది. వంగంలోని 'చమకిత' అనే శబ్దరూపము 'చకిత' అనే అర్థంలో అనుకరించబడినది. సరళాదేశాలు ఇచ్ఛానుసారం. ఇతర స్ఖాలిత్యాలు అనువాద సహజమైన దోషాలుగా భావించమని గుణగ్రహణపారీణులకు సంప్రార్థనము.

1944 సం॥ డిసెంబరు, 1945 సం॥ జనవరి మాసాల కృష్ణాపత్రిక సంచికలలో ఈ రచనము వరుసగా ప్రకటన పొందినది. ఆనాడు ఈ అనువాదము పట్ల తమకు కలిగిన సంతృప్తిని ఏతద్రూపముగా వెల్లడించిన కృష్ణాపత్రికాధిపతులగు దివంగతులు శ్రీ ముట్నూరి కృష్ణారావు పంతులుగారి గౌరవస్మృతికి నా వినీతాంజలి సమర్పిస్తున్నాను.

—అనువాదకుడు.

# దృశ్యావళి

| | | |
|---|---|---|
| దృశ్యం : | ౧. | అనంగాశ్రమం – చిత్రాంగద, మదనుడు, వసంతుడు. |
| దృశ్యం : | ౨. | మణిపురం – అరణ్య శివాలయం. |
| దృశ్యం : | ౩. | తరుతలమున చిత్రాంగద. |
| దృశ్యం : | ౪. | అర్జునుడు, చిత్రాంగద. |
| దృశ్యం : | ౫. | మదనుడు, వసంతుడు. |
| దృశ్యం : | ౬. | అరణ్యమున అర్జునుడు. |
| దృశ్యం : | ౭. | మదనుడు, చిత్రాంగద. |
| దృశ్యం : | ౮. | అర్జునుడు, చిత్రాంగద. |
| దృశ్యం : | ౯. | వనచరగణము, అర్జునుడు. |
| దృశ్యం : | ౧౦. | మదనుడు, వసంతుడు, చిత్రాంగద. |
| దృశ్యం : | ౧౧. | శేషరాత్రి – అర్జునుడు, చిత్రాంగద. |

# చిత్రాంగద

ఇందలి చిత్రములు
శ్రీ పిలకా నరసింహమూర్తిగారిచే రచింపబడినవి

# చిత్రాంగద

(ఏకాంక నాటిక)

## దృశ్యం: ౧

అనంగాశ్రమం

చిత్రాంగద - మదనుడు - వసంతుడు

**చిత్రాంగద**

నీవు పంచశరుండవో?

**మదనుడు**

ఆ మనోజు
డేన, నిఖిలజగమ్ములో స్త్రీపురుషుల
హృదయముల వేదనాబంధనముల, తోడ
చేరికయొనర్తు.

**చిత్రాంగద**

ఎట్టి వేదనయొ, ఎట్టి
బంధనమ్ములో ఈ దాసి కెరుక గలదు.
నీ పదమ్ముల మత్ప్రణామమ్ము.
నీవు
నెట్టి దేవుండవో, ప్రభూ!

వసంతుడు

ఎరుగు మేను

ఋతువులకు రాజును, అనుని మేషమ్ము జరయు
మృతియు దైత్యద్వయము జగదస్థిపంజ
రమ్మును బహిర్గత మ్మొనరింప దివురు ;
వారి వెన్నంటి యడుగడుగున తదీయ
రాజ్య మే నాక్రమింతు ; రాత్రిందివమ్ము
సాగు నీ సమరమ్ము, నే నా యనంత
విశ్వసర్వస్వ పూర్ణయావనుడ.

చిత్రాంగద

కొనుము

మత్ప్రణామమ్ము, దేవ ! త్వద్దర్శనమున
దాసి చరితార్థ.

మదనుడు

కల్యాణి, దేని వలచి
నీవు పొనరించు నీ కఠోరవ్రతమ్ము ?
నీ తపస్యానలమ్మున మలినఖిన్న
మయ్యె యావనకుసుమమ్ము, మహి ననంగ
పూజ నిట్టి విధాన మేనాడు లేదు.
ఎవరు నీ, వేమి వలతు వో భద్రమూర్తి ?

చిత్రాంగద

దయ దలిర్ప నా చరిత్ర తొలుత వినుము,
పిదప మత్ప్రార్థనము నివేదించుదాన.

మదనుడు

వినుట కే నుత్సుకత నుంటి.

చిత్రాంగద

మణిపురంపు

రాజకన్య చిత్రాంగద నేను. మాదు
పితృకులమ్మున నెన్నడు పుత్రి జన్మ
మొందబోల, దీ వరము తపఃఫలమ్ము
గా ఉమాపతి యలనాడు తా నొసంగె.
ఆ మహావర మ్మేను వ్యర్థ మ్మొనర్చి
నట్టిదాన. అమోఘమా దేవవాక్కు
మాతృగర్భమ్ము జొచ్చి మత్ప్రథమ దుర్బ
లాంకురమ్మును పురుష చిహ్నాంకిత మ్మొ
నర్పగా నోడె శివతేజ కలితమయ్యు.
అంత కఠిన నారీత్వమ్ము నాయది.

మదనుడు

అగు,

నటులె వినియుంటి. కావున త్వత్పితయును
పుత్రసదృశమ్ముగా నిన్ను బెనిచె. రాజ

దండనీతి ధనుర్విద్యలందు కౌశ
లమ్ము కుదురుపడంగ నేర్పించె.

చిత్రాంగద

అటులె

పురుషవేషమ్మునను యువరాజు పోల్కి
స్వేచ్ఛ దిరుగాడి నిరతమ్ము జేయుదాన
రాజకార్యమ్ము లెల్ల. లజ్జాభయమ్ము
లంతిపురనివాసమ్ము నే నస లెరుంగ,
ఎరుగనైతి విలాస చాతురుల నెరపు
హావభావముల్, విలువిద్య నెంత నేర్చి
యున్న నేమాయె, దేవ, నీ సుమధనుస్సు
నయనకోణమ్మునం దెక్కువెట్టు సరణి
నేర్వనైతి నే నిసుమంత.

వసంతుడు

ఓ సునేత్రి,

అట్టి విద్య ఏ నారియు కష్టపడి గ
డించునది కాదు. నయనయుగ్మమ్ము తాన
తనపని తనంతె నెరవేర్చు, నెవరి యెడద
నాటునో వారి కది వెంటనే సువేద్య
మగునులే.

## చిత్రాంగద

ఒకానొకదిన మ్మేను నొంటి
నమలపూర్ణానదీ తీర నిబిడకాన
నాళి మృగయావినోదార్థ మరిగియుంటి.
అశ్వమును తరుమూలమ్మునందు గట్టి,
వెంబడించితి మృగపద చిహ్నములను
కుటిల దుర్గమ వనపథ మనుసరించి.
మంద్ర ఝిల్లీముఖరిత నిత్యాంధకార
మై, లతాగుల్మ గహన గభీరమౌ న
రణ్యపథమున నొక్కింత కడచి కాంచి
తిని హఠాద్దృశ్య మంత, సంకీర్ణ పథము
నడ్డగించి భూస్థలి శయనించియున్న
మలినవసన పరివృతుండు పురుషమూర్తి.
'ఓసరిలి లేచిపొమ్మ' ని కసరి పల్కి
తిని అవజ్ఞాస్వరమ్మున నతని,—నతడు
కదలగాలేదు, నన్గాంచి మెదలలేదు.
హెచ్చిన యధీరరోషమ్ము పెచ్చుపెరిగి
నాదు ధనురగ్రభాగమ్ము తోడ నతని
తాడితు నొనర్చితిని ;—దీర్ఘ సరళ దేహ
మొక్క త్రుటి లేచినిలిచె నా యెట్టయెదుట—
భస్మసుప్తానలము ఘృతాహుతిని బొంది

క్షణికమున కీలికారూప మగుచు నూర్ధ్వ
ముగ నెగసినట్లు. ఒక రెప్పపాటువేళ
నా దెసకు జూడ్కులు నిగిడ్చె—ఒక్క చిటుక
లోన గరగిచ నెను రోషదృష్టి; నాట్య
మాడె నధర ప్రాంతమ్మున స్నిగ్ధ గుప్త
కౌతుకమ్ము చిప్పిలు మృదు హాస్యరేఖ,
నా చిరుత బాలమూర్తి నెమ్మది దలంచి.
నేర్చి పురుషుల విద్యల, నే ధరించి
పురుష వేషమ్ము, పురుషసంఘమున మసలి
ఇంతకాల మెయ్యది విస్మరించినానొ,—
ఆ వదనదర్శనమ్మున, ఆ స్వయంప్ర
భా ప్రఫుల్లమూర్తిని గనినంత,—నా క్ష
ణమ్ములో నది స్మరణకు వచ్చె, నారి
నే నటంచు. కాంచితి తొలిసారి నా క్ష
ణమ్మునను సమ్ముఖమ్మున పురుషు నొకని.

మదనుడు

ఓ సులక్షణా, ఆ శిక్షణమ్ము నాది.
జీవనమ్మున నొకదిన మొక్క పుణ్య
శుభమయ క్షణమ్మున సచేతన మొనర్తు
స్త్రీహృదయమందు స్త్రీత్వమ్ము, పురుషహృదయ
మందు పురుషత్వము—అంతట సంఘటిల్లె
నేమి ?

చిత్రాంగద

సభయవిస్మయ కంఠమున నడిగితి,
'ఎవరు నీవ' ని; ప్రత్యుత్తరమ్ము వింటి
'నేను పార్థుడ, కురువంశధరుడ' నంచు.
నిలిచిపోతి చిత్రప్రాయముగ, ప్రణామ
మాచరించుటే మరచితి. ఇతడ పార్థు
డస్మదాజన్మవిస్మయుండు? అగును, వింటి
సత్యపాలనార్థము ద్వాదశాబ్దములుగ
నడవులంబడి బ్రహ్మచర్య వ్రతమ్ము
నెరపుచున్నవాడట అర్జునుండు. ఇతడె
యగునో ఆ పార్థవీరుడు!

బాల్యచాప
లమున గొన్నిదినాల నే నాసపడితి
నిజ భుజబల ప్రతాపమ్ము నెరపి పార్థ
కీర్తి నిష్ప్రభ నొనరింతు నే నటంచు;
అతనిబోలె నవ్యర్థలక్ష్యమ్ము నేను
గూడ సాధింప నుంకించినాను; పురుష
ఛద్మవేషాన నతని నెదిర్చి సమర
మొనరుపంగ మదీయ వీరత్వపరిచ
యమ్ము గలిగింప నతనికి.

ఓసి ముగ్ధ!,
ఎచట దాగె నానాటి నీ స్పర్ధ! 'ఆత

డటుల నిలిచిన భూస్థలి నొక్క తృణద
ళమ్ము నేనైన, ఆతని చరణతలము
నందు దుర్లభమరణమ్ము నభిలషింతు
నాకుగల శౌర్య వీర్య లేశమ్ము మంటి
గలిపి' యని తలంచితివి గదా.

మరచితి

నే తలంపు లప్పుడు మది నిరవుకొననొ.
ఊరకుంటి చూచుచు వీరు డా వనాంత
రాళమున కలసమ్ముగా నడుగులిడుచు
తరలిపోవంగ. చమకితనై నిలచితి
నంతలో; నా క్షణాన మదంతరాంత
రాన చేతన జన్మించె; నన్ను నేనె
చెప్పలేనంతగా నింద చేసికొంటి—
అయ్యయో మూఢురాల! సంభాషణమ్ము
నెరపవైతివి, కుశలమ్ము నడుగవైతి,
వకట! క్షమనైన వేడుకో జాలవైతి,
బర్బరుని రీతి నూరక నిలువబడితి,
హేళనాభావ మెద నిల్పి వీరు డరిగె—
ఆ క్షణికమందు మరణింప నిచ్చవొడమె.
మరుదినమ్ము ప్రాతస్సున పురుష వేష
మెల్ల దూరమ్ముగా పారవైచినాను.
ధారణ మొనర్చినాను రక్తాంబరమ్ము,



“ఊరకుంటి చూచుచు...” —పుట: 14

క్వణిత కింకిణీకంకణ కాంచికలను.
అభ్యసించని యా వేష మంగకముల
సోకి, ఏకాంతసంకోచ మేదొ యావ
రించి, లజ్జాజడిమ క్రమ్మె. అపుడు గోప
నముగ వనసీమ జేరి కాననశివాల
యమ్ము దరి గాంచి తాతని.

మదనుడు

భయము లేదు,
పలుకు మోబాల! నా సమక్షమున లజ్జ
పడగ జెల్లునె? నే మనసిజుడ నగుట
మానసాంతర్గత రహస్యజాల మెల్ల
నాకు తేటతెల్లమ్ము సుమ్మా.

చిత్రాంగద

తదుపరి
నేమి పలికియుంటినొ, అత డేమి పలుక
వింటినో స్పష్టముగ స్మృతి నిలువ లేదు.
చెప్పుమని యానవెట్టకు దేవ! అంత
వజ్రపాతమ్ము వలె లజ్జ విరిగిపడె శి
రమ్ముపయి, నైన నను శతధా విభిన్న
మొనరుపం జాలదాయె—నారీస్వరూప
మైన నంతటి పురుషప్రాణమ్ము నాది!—

ఎటుల తిరిగి గృహమ్ము జేరితినో గాని
వికలదుస్స్వప్న విహ్వలాత్మగతి నపుడు.
అతడు పల్కిన శేషవాక్యమ్ము మాత్ర
మస్మదీయ కర్ణమ్ముల తప్తశూల
మట్లు వేధించి మ్రోగుచున్నయది—'బ్రహ్మ
చర్య వ్రతధారినై యుంట నేను, ఓ వ
రాంగి! పతిగాగ నర్హుడగా' నటంచు.
పురుషుని బ్రహ్మచర్యము!—అద్దాని భగ్న
మొనరుపం జాలనైతి నిసీ!

తెలియదో,

మీనకేతనా! ఎందరు మునులు, ఋషులు
తమ చిరార్జితమౌ తపస్యాఫలమ్ము
ధారవోసిరో స్త్రీచరణాంచలముల.
క్షత్రియుని బ్రహ్మచర్యమ!—ఛిన్నభిన్న
మొనరిచితి నిల్లుసేరి ధనుశ్శరముల
నెల్ల! ఇంతకాలమ్ము గర్వితధనమ్ము
గాగ దలపోసికొన్న నా యీ కిణాంక
తమ్మగు బాహువునకు లాంఛనముగాగ
నోసగితి మదీయ నిష్ఫలాక్రోశభరము.
ఇంతకాలమ్ము పిదప గ్రహింపజాలి
తిని పురుషమానసము నారినై జయింప
నేరనేని విద్యలవెల్ల నిష్ఫలము ల

టంచు. అబల కోమలమా మృణాళబాహు
యుగళి మద్బాహువులకన్న శతగుణమ్ము
బలతర మటంచెరింగితి. ధన్య యా ప
రావలంబితయగు ముగ్ధ మూర్ఛ శీర్ణ
దేహవల్లిక, గాఢ లజ్జాభయ ప్ర
తప్త లీనాంగినియగు సామాన్యలలన ;
ఏలనన, ఆమె త్రస్త దృక్పాతమునకు
లోనయి పరాభవమ్ము పాలౌను వీర్య
బలమయిన, మానిజన తపస్తేజమైన.
హే అనంగదేవా! జయించితివి నీవ
దొక్క వ్యూహమ్ము బన్ని నా దంభమెల్ల.
ఎల్ల విద్యల, బలమెల్ల నీ పదాన
తమ్ము గావించికొంటివి. ఇక త్వదీయ
విద్య నాకు ప్రసాదింపుము ; ఒసగుమయ్య
అబలల బలమ్ము నాకు, నిరస్త్రలైన
వారి అస్త్రసర్వస్వమ్ము.

మదనుడు

అగుదులే స

హాయుడను నీకు నేనిక. ఓ శుభాంగి!
రమ్ము, విశ్వజయాంకు డర్జును జయించి
బందిగావించి నీ సమ్ముఖమున నుంతు.

రాజ్ఞివై యాతని కొసంగుదాన వపుడు
దండనపురస్కృతి యథేచ్ఛ. శాసితునిగ
జేయుదానవు లెమ్ము విద్రోహి నతని.

చిత్రాంగద

వ్యవధి కలిగిన నేన ఏకాకినిగనె
అడుగడుగు పొంచి యాతని హృది హరించి
నా యధీనమ్మొనర్చుకో జాలుదాన,—
దేవతల సాయమును గోరుదాన గాదు.
పజ్జ సంగినిగా నిల్తు, భయద సమర
రంగమున సారథిగ నౌదు, అనుసరింతు
కాననమ్ముల మృగయావినోదములను,
మేలుకొని శిబిరద్వార పార్శ్వమందు
రాత్రివేళ ప్రహరి నౌదు, భక్తిభరిత
నగుచు పూజింపుదాన, నే భృత్యభావ
మలవరచికొని సేవింతు, క్షత్రియుల మ
హావ్రతమ్మగు నార్తసంత్రాణ కార్య
మందు తోడౌదు సఖ్యధర్మమున సతము.
కుతుకమున నొక్కనాడు నా వెనకు చూడిక్క-
బరపి మనమున భావించుకొనెడివా డ
తండు, 'ఈ బాలకు డెవండు, పూర్వజన్మ
ముల తరలివచ్చినట్టి చిరంతనాత్రి

తుందు, ఈ జన్మమునను న న్ననుసరించె
దాసుడై నా సుకృతివిధాన ?' నని. క్రమేణ
అతని హృదయకవాట విపాటన మ్మొ
నర్చి దాన చిరస్థానలబ్ధి పొంద
జాలి యుండెడిదాన.

నా ప్రేమ కేవ
లమ్ము నాక్రందనప్రపూర్ణమ్ము కాద
టం చెఱుంగుదు. అవ్యక్తధీరమతి ని
శీథబాష్ప జలమ్ముల చిర హృదార్తి
దోహదమొనర్చి, మ్లాన హాసావరోధ
మున నడంగి దివాలోకమును తిరస్కృ
తమ్మొనర్చు నాజన్మవైధవ్యనారి,
నామెబోలు రమణి నేను గాను. నాదు
కామిత మదెన్నటికి నిష్ఫలమ్ము గాదు.
నిజహృదయ మొక్కపరి ప్రకాశితమొనర్ప
జాలుదేని నా వశుడయి తీరువా డ
తండు ;—హతవిధి, అక్కటా, అల్లనా డ
దెట్టి రూపాన నాతని కంటబడితి !—
గాఢలజ్జాభరాన కుంచితయు శంకి
తయును కంపితయగు నారి పోల్కి, వివశ
విహ్వల ప్రలాపవాదిని సరణి. అయిన
నంతమాత్రపు దాననే యగుదునా య

థార్థముగ నేను? ప్రతిపథమ్మున, గృహమ్ము
నందు, నలుదిక్కులను గాంచనోవు దీన
క్రందనాధికారిణులైన కామినీ స
హస్రమునకన్న నొక్కింతయేని మిన్న
గానొకో నేను? కాని, అయ్యో, తనంత
తాన కలరూపు ఒరునికి పరిచితమ్మొ
నర్చు పూన్కి కదెంత ధైర్యమ్ము వలయు,
నెన్ని దివసమ్ములకు సంఘటిల్లు? అట్టి
కార్యమది చిరజీవన దీక్ష. జన్మ
జన్మముల వ్రతనిర్వహణమ్ము! కాన
నే యిటుల జేరితిని భవద్ద్వారసీమ
కఠినతప మాచరించి.

హే భువనవిజయి,
దేవ! సుందర ఋతురాజ! తుడిచివేయు
మొక్క దివసకాలము జన్మదాత యా వి
ధాతృ నభిశాప మది!, వినాదోషప్రాప్త
మైన నారీస్వరూపకళంక, మొసగు
మోయి నాకు నపూర్వ సౌందర్యశోభ.
ఒక్కదివస మయ్యది నా కొసంగితేని
తదుపరి చిరమ్ము నా హస్తగతము.

అతని
తొలుత గాంచిన సుక్షణికమ్ము లోన

మద్హృదయమం దనంత వసంతఋతువు
మేలుకాంచె. ఆ యౌవనోచ్ఛ్వాసమున స
మస్త దేహమ్ము చూచుచు చూచుచుండ
నే యపూర్వ పులకభరత్వ మావహిల్లి,
లక్ష్మి చరణశాయియౌ జలేజమట్లు
ప్రస్ఫుటితమై తలిర్ప గాఢేచ్ఛ వొడమె.
హే వసంత, వసంతసఖా, మదీయ
మౌ ప్రగాఢవాంఛను తీర్పుమోయి, చాలు
నొక్కదినము.

మదనుడు

తథాస్తు!

వసంతుడు

తథాస్తు! ఒక్క
దివస మేమగు, వాసంతపుష్పశోభ
ఒక్క వత్సరకాల మింపెసగ నీదు
తనులతిక నావరించి సుమించు గాత!

# దృశ్యం: ౨

మణిపురం—అరణ్య శివాలయం

అర్జునుడు

ఎవరి నట గాంచితిని? అది సత్యమగునొ,
కాక మాయయో? నిబిడ నిర్జన వనమ్ము
లోన నిర్మల సరసి;—నిరాలయమ్మ
దెంతయును నిభృత మ్మందు, తోచు మదిని,
స్తబ్ధమధ్యాహ్న వేళల కానవేంది
రాగణమ్ములు జలకేళి సలుపుచు రని,
శాంత సుగభీర పూర్ణిమానిశల వార
లచటి సుప్తసర స్తీరమందు మృదుల
శాద్వలస్థలి హాయి విశ్రాంతి గొందు
రనుచు నిశ్శంక విస్ఖలితాంచలలుగ.
అచటి తర్వంతరాళసీమను దినాంత
సమయమందు నెమ్మదిని తలంచుకుంటి
శైశవాది మదీయ జీవనచరిత్ర;
లోక సంసారమందు నుద్రూతలూగు
దుఃఖ సుఖముల మూఢ ఖేలనము, మర్త్య
మానవుని జీవనపు టసంతోష, మప్ర

పూర్ణ మాశ, యనంతదారిద్ర్య మెల్ల.
అట్టి సాయాహ్న వేళ కానన ఘనాంధ
కార పరిసీమ వెలివడి మందగమన
మున సరోవర సోపానపాళి నమల
శీతల సితోపలతలమ్ము జేరి నిల్చె
నే మధురమూర్తి! ఎంత యపూర్వరూపము!
ఆమె కోమలచరణతలాన ధరణి
తల మదెంత నిశ్చలతరమై తలిర్చె!
కాంచుచుండ నుషఃకాల కనకమేఘ
శకలము కరంగి మిళితమై పూర్వపర్వ
త సితశిఖరమ్మునం దకలంక నగ్న
శోభల వెలార్చు గతి, నామె స్నిగ్ధచేల
మంగలావణ్యమున సుఖావేశగరిమ
గరగి లీనమ్ము గాగోరు సరణి దోచె.
మెల్లమెల్ల సరస్తీరమునకు దిగి ని
జాననచ్ఛాయ కౌతూహలాన నీర
మందు తిలకించె, చమకితయగుచు లేచె.
క్షణములో మృదుదరహాస మొల్కె, వామ
బాహువును సాచి సంతోషభరితహృది వి
నీల కేశపాశము విరబోసివైచె;
విహ్వలత సాగిలంబడె ముక్తకేశ
రాశి తచ్చరణ ప్రాంతమున విరాళి.

అంచల మ్మోసరించి సారించె దృక్కు
లామె తన యనిందిత బాహుయుగళి, స్పర్శ
సుఖ రసాస్వాద కోమలకాతరమ్ము,
ప్రేమ కారుణ్య నవనీతసేచితమ్ము.
సంతసమ్మున శిర సోసరించి కనె ప
రిస్ఫుటమ్మగు తనుతటి బొటమరించు
యౌవనోన్ముఖోత్ఫుల్ల వికాస, మంత
నవ్య గౌర తనూతలమందు బర్వి
నట్టి లజ్జాసముజ్వల రక్తిమమ్ము
జూచికొనె ; పాదయుగము సరోవరంపు
నీరముల జారవిడిచి తచ్చరణశోభ
తాన తిలకించె. అతిశయ విస్మయమ్ము
వెలివరిచె నామె తన్నుదా దెలిసి కనుట
కదియె తొలిసారియో యన్నయట్లు—శ్వేత
శతదళము ముకుళితనయనముల గడపి
కోరకవయస్సు, ప్రథమ ప్రపూర్ణ వికస
నమ్మొదవు నా దినోదయ మ్మైనయంత,
గ్రీవ మిసుమంత వాల్చి సరోవినీల
నీరముల దన్నుదా దొలిసారి చూచి
కొని సవిస్మయమ్ముగ దినమెల్ల ప్రొద్దు
బుచ్చు రీతి.

మఱుక్షణమ్మున వదెట్టి
దా విషాదమో దరహాస మంతరించె
నధరమున, మ్లానమయ్యె తదక్షియుగము,
కేశపాశ మాబద్ధమ్ము జేసె తిరిగి,
అంచలము దేహవల్లి బిగించె: విడిచి
యొక్క దీర్ఘనిశ్వాస మా యువిద చనియె,
స్వర్ణ సాయాహ్నకామిని మ్లానవదన
యై తిమిరరాత్రి దెస పయనించినట్లు
మృదుపదమ్ముల.

అంత భావనలు వొడమె
నెడదలో, ధారుణీమాత నిజహృదంత
రాళమే విచ్చి యైశ్వర్యజాల మొలుక
బోసెనంచు; ప్రపూర్ణ వాంఛిత మెదురయి
చమకితు నొనర్చి మాయమై కరగిచనె న
టంచు; నెన్ని యుద్ధములు, నదెంత హింస,
యెంత ఆడంబరము, పౌరుషంపు గౌర
వంపుసంపద వీరత్వ నిత్య కీర్తి
కాముకత్వ మదెంత, సమస్త మా ప్ర
పూర్ణసౌందర్య సమ్ముఖమ్మున ప్రశాంత
మై యిలాతలి సాగిలంబడెనొకో య
టంచు, సింహేంద్రవాహినీదేవి భువన

వాంఛితారుణ చరణతలమ్మున మృగ
రాజమగు సింహము వినీతమైన సరణి.
ఇంక నొకపరి దరిసెన—మెవరు తలుపు!

(ద్వారము తెరచి)

ఏమిది! ఆ మూర్తియే! శాంతిలుము హృదయమ!
నన్నుగని భీతిలకు మో వరాననా! ఇ
తండు క్షత్రియకులజాతు, డభయదాయ
కుండు భీతాత్ములకును దుర్బలుల కెపుడు.

చిత్రాంగద

ఆర్యవర! నీవు నా కిప్పు డతిథి వయితి,
ఏచటి మందిర మిది మదాశ్రమము, ఎఱంగ
నెటుల పొనరుప నగునో యభ్యర్థనమ్ము,
దెట్టి సత్కారములను సంతుష్టు జేయ
నగునో!

అర్జునుడు

హే సుందరీ! భవద్దర్శనమ్మె
తగిన సత్కార మతిథికి; తావకీన
శిష్ట వాక్యజాలమ్మె సంపత్కరమ్ము
నాకు. అపరాధముగ నెంచబోక తెల్పు
దేని, ప్రశ్నమొక్కండు జేయగ మదీయ
చిత్త మెంతొ కుతూహలాయత్త మయ్యె.

చిత్రాంగద

అడుగుమోయి నిర్భయముగ.

అర్జునుడు

ఓ శుచిస్మి

తా! తెలియగోరువాడ, నెంతటి కఠోర
వ్రతముమై నిట్టి నిర్జన దేవతాల
యమ్మునం దింత సుందరరూపరాశి
నీసడించి విసర్జన చేసితివో,
ఆ యభాగ్య మర్త్యజనాళి వంచితుల బొ
నర్చి.

చిత్రాంగద

గుప్తమా నొక కామ్యసాధనార్థ
మిచట శివపూజ నుంటి నేకాగ్రమాన
సమున.

అర్జునుడు

హా! జగత్కామ్యధనమ్మ! నీదు
కామనకు లక్ష్య మెట్టిదో గదె? సుదర్శ
నా! ఉదయగిరి శిఖరమ్ము మొదలు నస్త
నగపరివ్యాప్త భూమి నెల్లెడల మసలి
తేను; ఏ నేడుదీవుల నడుమగల ద

దెట్టి దుర్లభసౌందర్య, మే యచింత్య
మా మహత్వ మ్మదెల్ల కన్నార గాంచి
నాడ; నీ వేమి వలతు వెవ్వరిని దలతు
వోకో నాకు వచింపజాలుదువ యేని,
నావలన విననగు నీవు కోరు వార్త.

చిత్రాంగద

నే వలచునాత డీ త్రిభువన సుపరిచి
తుండయిన వాడె పో.

అర్జునుడు

అట్టి నరవరుం డె
వండగునొకో ధరాతలి! ఎవని కీర్తి
పుంజ మమరకాంక్షితము త్వదీయహృదయ
రాజ్య దుర్లభసింహాస నాధికార
మును గడించె? తన్నామాక్షరముల దెల్పు
మాలకించి కృతార్థుడ నగుదు నేను.

చిత్రాంగద

అతడు జన్మించినది సర్వశ్రేష్ఠ నృపతి
కుల, మతడు సర్వశ్రేష్ఠ వీరుండు.

అర్జునుడు

అసత్య
కీర్తి యానోటనానోట, మాటమాట

నిల పరివ్యాప్తమగు, క్షణస్థాయి హిమము
పావగుంఠనమై యరుణోదయమ్ము
మింట దోచనంతవట్టు మినికినట్లు.
ఓ సరళ కామినీమణీ! ఒసగబోకు
మిట్టి దుర్లభ సౌందర్యభాగ్యమును మృ
షాయశస్సు నుపాసించి. వినగజెప్పు
మెవ్వరా సర్వశ్రేష్ఠ వీరుండు, సర్వ
శ్రేష్ఠ కులశేఖరుడు ధరాతలి దలంప!

చిత్రాంగద

పరయశోసహిష్ణుండవై పలుకుచుంటి
వెవరు నీవు సన్న్యాసి! ఈ త్రిభువనాల
రాజవంశ చూడమ్మైన కురుకులమ్ము
పేరు విననట్టివా రెవ్వరేని గలరె!

అర్జునుడు

కురుకులమ?

చిత్రాంగద

అట్లయగు. కురువంశమునకు
నక్షయయశుం డెవండు, వీరేంద్రకేస
రియు, నతని పేరు వినియుంటివా!

అర్జునుడు

భవద్వ
చస్సునసె వినగోరెడివాడ, పల్కుము.

చిత్రాంగద

అర్జును డతండు; గాండీవధన్వి, భువన
విజయి. తన్నామధేయాక్షరాళి నేను
నిఖిలజగదంతరము నుండి సేకరించి
పూర్ణత దలిర్ప నాదు కౌమారహృదయ
సీమ నతియత్నమున గుప్తపరచికొంటి.
పలుకవైతి వదేల నో బ్రహ్మచర్య
వ్రతి? మదాకాంక్షితమ్మెల్ల మిథ్యయగున!
మిథ్యయగున అర్జుననామము? అదియ మిథ్య
యందువేని మద్హృదయాంతరాళమును వి
విభిన్నము నొనర్చి దానిని వెడల నడతు,
శూన్యమున బడి ముఖముఖమ్మున వెలివడి
ఎగసి తిరుగాడిపో విడనాడివైతు.
అట్టిదానికి నారీహృదంతరాస
నమున తావుండబోలదు!

అర్జునుడు

విను మొహాోవ
రాంగి! ఆ యర్జునుండు, ఆ పాండువంశ

30(B)





"ప్రేమార్తుడగు నతిథిని..." —పుట : 31

జుండు, గాండీవి, ఆ భాగ్యశాలి నీదు
చరణముల శరణాగతుం డిపుడు సుమ్ము.
అతని పేరుకీర్తులు, శౌర్యవీర్యతలును
మిథ్య కానిమ్ము, సత్యమై మిగులనిమ్ము;
ఏ సుదుర్లభలోకాన తావొసంగి
నావొ యాతని కటనుండి తిరిగి విచ్యు
తునిగ నొనరింపబోకు వితీర్ణపుణ్యు
స్వర్గవిచ్యుత హతభాగ్యు సరణి జేసి.

చిత్రాంగద

నీవు పార్థుండవో?

అర్జునుడు

దేవి, నేన పార్థు
డను, భవత్ హృదయద్వారసీమ నిలిచి
నట్టి ప్రేమార్తుడగు నతిథిని.

చిత్రాంగద

అర్జునుడు

ద్వాదశాబ్దనియామక బ్రహ్మచర్య
దీక్ష పాలించుచుండె నటంచు వింటి.
అట్టి వీరుడు కామినీకాంక్ష వ్రతవి
భంగ మొనరించునొక్కొ? సన్యాసి, అగున
నీవు పార్థుండ వగుట!

అర్జునుడు

సత్యమ్ము, నీవు
మద్వ్రతవిభంగ మొనరించినావు, చంద్ర
బింబ ముదయమై గాఢనిశీథ సాంద్ర
తిమిరమను యోగనిద్ర నిమేషమున వి
భంగము నొనర్చు పోల్కి.

చిత్రాంగద

ఇసీ, యిదేమి
పార్థ! నే నెవ్వతెను, ఎంతదాన, నేమి
గాంచితివి నా హృదంతరమందు, నన్ను
గూర్చి నీ కేమి యెరిక గల్గినది? దేని
కొరకు నీ వాత్మవిస్మృతి పాలయితివి!
క్షణికమున సత్యభంగ మొనర్చి, ఏరి
కొరకు అర్జుననామ మనర్జునునిగ
జేసివైచితివోయి?—నాకొరకు కాదు,
ఈ వినీల నేత్రోత్పలయుగము కొరకు.
ఈ సుకోమల నవనీతమృదుల బాహు
యుగళ పాశమ్మునం జిక్కువడియె సవ్య
సాచి యర్జును, డాతని బాహుయుగళి
సత్యబంధనమ్ముల దెగద్రెంచి,— ఎందు
బోయె నుత్కృష్ట ప్రేమమర్యాద? ఎచట

మాయమాయె నారీత్వసన్మాన; మఱియు,
తన్ను మించి యతిక్రమణ మ్మొనర్చె
తుచ్ఛమీ దేహయష్టి, అమర్త్యమంత
రంగమును కప్పిపుచ్చు నీ ఛద్మవేష
మీ క్షణస్థాయి. తెలియకపోతి నింత
దనుక నీ ఖ్యాతి, నీదు వీరత్వ మెల్ల
నింతగా మిథ్యయై చెల్లునంచు.

అర్జునుడు

ఖ్యాతి

మిథ్య, మిథ్య వీర్యమ్మని యెఱుకవడియె
నేడె నాకు. నెమ్మది బొడకట్టె నేడు
సప్తలోకమ్ము లొక స్వప్నసదృశ మగుచు.
ఈవె ఏకైక పూర్ణత్వ, మీవె సర్వ,
మీవె జగదఖిలైశ్వర్య, మఖిలదైన్య
తలకు మహదవసాన మేకైక నారి
వీవె, కర్మసర్వస్వ విశ్రామరూపి
ణివియు నీవె, నిన్బొడగాంచినంతనే సు
బోధమయ్యె నే యానందకిరణపుంజ
మందు ప్రథమ ప్రభాతోదయాన నంధ
కారమహదర్ణవమ్మున సృష్టిశతద
ళమ్ము దశదిశాతటుల నున్మిషితమాయె

నొక్క త్రుటిలోన. మరి సకలమ్ములో క్ష
ణక్షణమ్మును, నను నిమేషమ్ము నిన్నె
బహుదినమ్ములుగా పోల్చికొంటి నేను.
ఒక్క దృష్టిపాతమ్ములో నీ సమస్త
మూర్తి నాలోన నెంత బింబితమొనర్చి
కొన్న నది యశేషమ్ముగా మిగులు.

నొక్క

తరిని కైలాసశిఖరసానువుల నొంటి
నలసి మృగయావినోదాన, తృషితతప్త
తనుడనై, రెండుజాములౌనంత చేరి
కొంటి కుసుమవిచిత్ర మానససరస్త
టప్రదేశము. సురసరస్సలిలముల మ
దీయ దృక్ప్రసార మ్మైనయంత నయన
యుగళి బింబించె నా యనంత మ్మతలము.
స్వచ్ఛజలపూర మది యగాధమ్ము. దాన
ప్రతిఫలితమయి మధ్యాహ్న వేళ సూర్య
రశ్మి రేఖాసమూహమ్ము స్వర్ణ నీర
జాతసుమ సువర్ణమృణాళజాలముల స
మేళమై జలజల దిగజారి మెరసె
నా యసీమ సరోవరాగాధములను.
నా హృదంతరమున దోచె నా క్షణాన

సూర్యభగవానుడే నిజకరసహస్ర
చలనమున జూపగాబోలు మర్త్యమాన
వునికి, జన్మకర్మశ్రాంతజీవి కాయ
నంత శీతల సుందర మరణశాంతి.
నేడు నీలో విలోకించినాడ నా య
గాధనైర్మల్య మా యతలత్వ మేను.
దశదిశల నుండి యే దేవతాంగుళీ ప్ర
సారణమొ త్వదలౌకికాలోక మధ్య
మందు కేలెత్తి చూపగాబోలు కీర్తి
క్లిష్ట జీవన పూర్ణనిర్వాపణమ్ము
నాకు.

చిత్రాంగద

నాలోన కాదు, కాదోయి, అకట,
పార్థ! అక్కట, ఏ దివిజైంద్రజాల
మో!—తరలిపొమ్ము, పొమ్ము, పొమ్మోయి వీర
వర! ఉపాసింపబోకు మిథ్యానుభూతి.
అర్పణము సేయబోకు మిథ్యాపదాంకి
తముగ నీ శౌర్యవీర్యమహత్వ మెల్ల,
తరలిపొమ్మోయి, వైళమే తరలిపొమ్ము!

# దృశ్యం : 3

తరుతలమున చిత్రాంగద

చిత్రాంగద

అక్కటక్కటా, అతని తరలిపోవ
జేయగానగునో నాకు,—వీరహృదయ
మందు రెపరెప రెక్కలల్లార్చు నాకు
లతను, తృష్ణార్తయును కంపితయును విస్ఫు
లింగనిశ్వాసియు నగు హోమాగ్నిశిఖను
బోలు నద్దాని. అతని నయనవీక్ష
అంతరాంతరోద్గత బాహువట్లు నన్ను
లాగికొనిపోవగా నేగుదెంచులాగు
తోచు ; నాతని యుత్తప్తహృదయ మంగ
బంధనముల సర్వము తెగద్రెంచి రెక్క
లెగసికొని నన్ను జేరగా దివురునో య
నంగ ప్రత్యంగమందు వినంగబడు త
దీయ క్రందనధ్వని ! ఎట్లు తరలిపోవ
జేయగాజాలుదాన తత్తృష్ణ !

(వసంతుడు, మదనుడు ప్రవేశం)

హే య
నంగదేవా ! ఇదేటి రూపానలమున

నన్ను పరివేష్టన మొనర్చితివి! ఈ హు
తాశనజ్వాల తాన దగ్ధమగు, దగ్ధ
పరచు సర్వమ్ము.

మదనుడు

తెలియగా బలుకు, తన్వి,
వివరముగ నే విశేషముల్ జరిగె నిన్న
వట్టు; మన్మత్క పుష్పశరప్రసరము
కార్యసాధన కేరీతి గడగెనో వి
నంగ చిత్త ముత్తలపడు.

చిత్రాంగద

నిన్న నపర
సంధ్యవేళ సరోవర శాద్వలీత
టాంచలమ్మున రాలు వాసంత పుష్ప
పుంజమును చేర్చి పూసెజ్జ గూర్చి తేను.
శ్రాంత దేహమ్ముతో పరధ్యానలీన
మానసమ్మున శయనించినాను, వామ
బాహుతలమున నలసభావాన శిరసు
వాల్చి, గతదివసంపు విశేషముల నె
డంద తలపోసికొంచు. అర్జునుని నోట
నెట్టి సంస్తుతివాక్యముల్ చెవినిబడె న
వెల్ల తిరిగి సంస్మృతి మననమ్ము జేసి
కొంటి. దివససంచిత మమృతాసవమ్ము

బిందువుగ బిందువుగ గ్రోలగా దొడగితి.
పూర్వజీవితేతిహాసము గతజన్మ
గాథవోలె విస్మృతిగర్భసీమ నడగె.
తోచె నెమ్మది,—నే రాజకన్య గాను ;
నాదు జీవిక పూర్వాపరమ్ము లెరుగదు ;
ఏను భూస్థలి నొక్కదినమ్ములో వి
కాసిలితి ప్రస్ఫుటితనయి, వనసుమమ్ము
వోలె పితృమాతృహీననై ; కేవలమ్ము
ఒక్క దివసకాలమె పరమాయువై త
దంతరమ్మున వినవగు భ్రమరగుంజ
రిత సుగీతమ్ము, వనవనాంతముల ముసరు
మంజులానంద మర్మరము ; అంత మెల్ల
మెల్ల నీలాంబరవిలగ్న నేత్రవీక్ష
ణమ్ముల మరల్చి మసృణ మృణాళకంఠ
మోసరిలి వ్రాలి సోలి నే తేలిపోదు
వాయులహరీ మృదుస్పర్శ మాత్రముననె,
క్రందనవిహీన జీవినై, అంతలోన
నే ప్రపూర్ణమై చెల్ల నాద్యంతరహిత
కుసుమకోమ లానందజీవిత మటంచు.

## వసంతుడు

ఒక ప్రభాత సుక్షణికమ్మున నె ప్రఫుల్ల
మీ యనంతజీవనము, హే సుందరీ !

మదనుడు

త

ణస్వనిత రాగమందు సంగీతకళ న
నంతగాథ లెవో మర్మరించి మ్రోగు
రీతి. తదుపరి నేమాయె ?

చిత్రాంగద

తలచుచుండ

నే మలయవాయు మృదులసంస్పర్శ నంగ
కముల నెల్ల నిద్రాతరంగములు క్రమ్మె.
సప్తపర్ణశాఖాలోల ఫుల్లమాల
తీ లతామతల్లిక నా సితాంగకముల
నలస రాగవిహ్వల నీర వార్ద్రిచుంబ
నముల వర్షింపదొడగె ; సుమాళి కొన్ని
కేశపాశమ్మునను, కొన్ని పదతలమ్మ
నందు, కొన్ని యురోజతటాంచలముల
పరచికొన్నవి తన్మృతిశయ్య ; మేను
మరచు నిదుర గడచె కొంతకాల మట్లు.

గాఢనిద్ర నింతదనుక గనని నూత
నానుభూతి కలిగె నొండు—ఏరి ముగ్ధ
నయన దృక్పాతమో తీక్ష్ణరాగభర క
రాంగుళీదశక స్పర్శనమ్ము భాతి

మామకీన నిద్రాలస దేహవల్లి
బులకితమొనర్చె. అంతలో నిద్ర మేలు
కాంచితిని చమకితనయి. కంటి నెదుట
నిశ్చలప్రతిబింబమ్ము సరణి నిర్ని
మేషవీక్షణమ్ములను మత్పాద ప్రాంత
మందు నిలిచిన సన్న్యాసి ; నవుడు పూర్వ
గిరిశిఖరి వీడి పయనించి మెల్ల మెల్ల
పశ్చిమాశ జేరిన ద్వాదశీశశాంకు
డల్ల నిజహిమాంశుప్రసర మ్మదెల్ల
నొలుకవోసె విగళితవసనము మదీయ
నూతనామ్లాన శుభ్రసౌందర్యము పయి.
పుష్పసౌగంధ్య పూరితమ్ము తరుతలము ;
మృదుల ఝిల్లీవిరావ నిద్రానిమగ్న
మా నిశీథిని ; స్వచ్ఛ సరస్సలిలము
లందు శీతాంశుబింబ మకంపితమ్ము ;
సుప్త మనిలము !—ఆ చంద్రికాలోకమందు
మసృణ చిక్కణమ్మగు నంధకార పల్ల
వాళి రాశులుగా శిరస్సున భరించి,
ఆ యరణ్యమ్ము నిస్తబ్ధము. అట్ల యతడు
చిత్రసన్నిభుండుగ దీర్ఘకాయుడును వ
నస్పతిప్రతిముడు దండధారి బ్రహ్మ

చారి ఛాయాసహచరుండుగాగ నోచి,
నిలిచియుండె నచ్చోటనే నిశ్చలుడయి.
నిద్ర మేల్కొన్నయంత నల్దిశల దేరి
పార జూచితి; నెమ్మది దోచె నంత.—
ఎన్న డే విస్మృతప్రదోషమ్ము నందో
జీవనమ్ము త్యజించి పొందితిని స్వప్న
జన్మ మే యపరూప సమ్మోహసుప్తి
సీమనో, జనశూన్య మే మ్లానచంద్రి
కావృతమ్మగు వైతరిణీస్రవంతి
తీరభూమినో యని.—లేచి నిలిచినాను.

పదతలమ్మున శ్లథవసనమ్ము జారి
పడినయ ట్లసత్యపు లజ్జబిడియములును
నన్ను విడివడె నంత. నా శ్రవణయుగళి
సోకె 'మత్ప్రియా! ప్రియతమా!' యన్న మాట.
ఆ గభీరతరాహ్వానమహిమ నాదు
నేకదేహాంతరంగమ్ము నందె జన్మ
జన్మములు, శతజన్మముల్ మేలుకాంచె.
పలికినా నంత, 'కొనుము, చేకొను, మదెంత
కలిగె నాలో నదంత నీవే పరిగ్ర
హింపుమోయి, జీవనవల్లభా!' యటంచు.
బాహుయుగళి సారించితి.—చంద్రుడ స్త

మించె వనసీమ, మేదిని యంధకార
మగ్నమాయె; స్వర్గమర్త్యములును, దేశ
కాలములు, దుఃఖసుఖములు, జీవనమ్ము
మరణము నచేతనమ్మయి మాటుమణగె
నపుడు దుస్సహ పులకభరాంతరమున.

ఉదయకాల ప్రథమకిరణముల, విహంగ
ప్రథమసంగీత కలరుతి మేలుకాంచి,
వామకరమున భారమ్ము వైచి మెల్ల
మెల్ల శయ్యాతలమ్మున లేచి కూరు
చుంటి. తిలకించితిని సుఖసుప్త వీర
వరు. తదీయోష్ఠసీమ నర్తించె నలస
హాసరేఖ ప్రత్యూషేందుకళ విధాన,
గతనిశానంద శీర్ణావశేష మగుచు.
నిపతితోన్నత మా లలాటాంచలమున
నరుణకిరణ సంస్పర్శన మ్మయినయంత,
మర్త్యలోకాన నవోద్యదయాద్రి నవ్య
కీర్తిసూర్యోదయ మ్మొందు కలుగబోలు
నో యటంచు భావన మెదలోన బొడమె.
శయనతలమును వీడి లేచితిని దీర్ఘ
నిశ్వసన మొందు వెలిబుచ్చి; మాలతీ ల
తాలవాలము సావధానముగ దిగిచి

రవికరస్పర్శ సుప్తిముద్రితముఖమ్ము
సోకకుండ, చూచితి నలుదిశల గలయ
పూర్వపరిచిత ప్రాచీన పృథ్వితలము.

తిరిగి నెమ్మది నాత్మవిస్మరణ సోకె
నంత, నొక్కమ్మడిగ బారుదెంచితిని న
వప్రభాతంపు శేఫాలికా వికీర్ణ
తృణ వనస్థలి మీదుగా నిటకు, తనదు
చాయ గాంచి భీతిలు హరిణమ్ము పోల్కి.
నిర్జన లతావితానతలాన గూల
బడి కరపుటమ్ములను గప్పికొని ముఖమ్ము
వెక్కివెక్కి యేడ్వగ గోర్కెవాడమె, నైన
నేడ్వగా జాలనైతి.

## మదనుడు

ఓ మనుజపంతి

నీ! అకట! స్వర్గసుఖదివస మ్మొకండు
ఛిన్నమొనరించి ధారుణి నొక్కరాత్రి
పూర్ణము నొనర్చి త్వదధరసమ్ముఖాన
యత్నమున నందగానిచ్చినాడ, నా శ
చీప్రసాదితసుధ రతిచుంబితమ్ము
నందనానంద గంధసమ్మోదమధురి

తమ్ము గ్రోలంగనొసగితి! నైన తుదిని
క్రందనాలాపములె మిగిలెనొకో ?

చిత్రాంగద

దేవ !

ఎవరి నీవు గ్రోలించితి, వెవరి తృష్ణ
తీరె! ఆ చుంబనమ్ము లా ప్రేమసంగ
మమ్ము వల్లకీఝంకృతశ్రుతి విధాన
పులకలీని పరివ్యాప్తమైన యంగ
కమ్మిది మదీయ మెట్లగునోయి ! కాదు !
దీర్ఘకాల సాధనధనమై నిమేష
మాత్రసంప్రాప్త మా తొలిమేళనమ్ము—
ఆ మిలనసౌఖ్య మది దొంగిలించి నన్ను
వంచిత నొనర్చె నెవ్వతె! చిరసుదుర్ల
భమ్మయిన మేళనాసౌఖ్యసంస్మృతు లవి
యెల్ల దనతోడనే సేకరించుకొని య
తిప్రఫుల్ల పుష్పదళమ్ము భాతి నేల
వ్రాలి నను నస్మదీయ మాయావిలాస
మెల్ల ; చిరదినరాత్రు లీ రమణి శూన్య
హృదయమున రిక్తదేహమ్ముతోడ మిగిలి
ఎట్లొ కడతెంచు. హే మీనకేతనా! మ
దంగసహచరిగా చాయపోల్కి బంధి

తమ్మొనర్చితి వే మహారాక్షసిని? ఇ
దేటి యభిశాపమిది! చిరంతనతృషార్త
లోలుపాధరమ్మునకు చెంగటన దోచె
చుంబనప్రాప్తి, విడువక గ్రోలె దాని.

ఆ ప్రణయదృష్టిపాత మదెంత తీవ్ర
తరమొ, యంగమ్ము సోకినయంత వాస
నాప్రపూరిత రాగరేఖాంకిత మ్మొ
నర్చివైచు; తద్వీక్షణ మరుణకిరణ
సదృశమై చిరరాత్రితపస్విని యగు
నీ కుమారీహృదయపద్మ మున్న దెసకు
కాంతిజవమున దిగివచ్చె; కలిగె నంత
నాత్మవిస్మృతి, పారవశ్యానుభూతి.

మదనుడు

అయిన, గతరాత్రి వ్యర్థమై గడచె నందు
వో! తరంగఘాతమ్మున తటసమీప
వర్తియయ్యు నాశానౌక చేరజాల
కూరక వృథాప్రయాస పాలాయె నేమి?

చిత్రాంగద

దేవ, గతరాత్రి దొక్కసంగతియు జ్ఞప్తి
నిలువలేదు నెమ్మది. స్వర్గసుఖము నంత

సన్నిహిత మొనర్చితి వీవు. అనుభవించి
నానా కోల్పోతినో గణియింపజాల
నైతి నే నాత్మవిస్మరణైకసుఖత.

నేటిప్రొద్దు మేల్కాంచినయది మొదలుగ
హృదయ మతులనైరాశ్యధిక్కార విహ్వ
లత మదంతరాంతరము విదారణమ్మొ
నర్ప మొదలిడె. జ్ఞప్తిరాజొచ్చె నొక్క
టొకటిగా గతరాత్రివిశేషము లవి.
విద్యుదావేదనాదుస్సహమయి చేత
నత మదంతరబాహిరముల కొనర్ప
బోలు నొక వింతసాపత్న్య, మింక నేమ
రంగనీదు గాబోలు తదీయమూర్తి.
నా సపత్ని నీ రూపమ్ము నా స్వహస్త
ముల సయత్నమ్ముగా నలంకృత మొనర్చి,
పనుపగావలయును బోలు ప్రతిదినమ్ము
మత్ హృదాకాంక్షలకు తీర్థవాటి వాస
రప్రసవశయ్య జేరంగ. అవిరతముగ
పజ్జ నే నిల్చి కన్నులవిచ్చికొని ప్ర
తిక్షణమ్ము వీక్షింపగావలయు బోలు
తనపరమ్మగు నాదరతలను. ఇట్టి
శాప, మంగసౌభాగ్యమ్ము కలన నంత

రమున హింసానలము ప్రజ్వలించు ననుభ
వమ్ము, నరలోకమం దెవ్వారేని పొంది
యుండబోలునొకో !—

హే యనంగ ! నీ వొ
సంగిన వరమ్ము నీవె తీసికొనుమోయి.

మదనుడు

తీసికొందునా,—ఈ మృషావరణ మెల్ల
విసరి దూరమ్ముగా పారవైచి ఎట్లు
రేపటి దినోదయమ్మున పార్థసమ్ము
ఖమ్మునం దీవు నిలువంగసగును, కుసుమ
పల్లవవిహీన హేమంత హైమశీర్ణ
లతికవోలిక ? సుఖరసాస్వాదనమ్ము
నొక్కపుటిక గ్రోలగనిచ్చి, నోటినుండి
యా సుధాపాత్ర నూడదీసికొని నేల
వైచి చూర్ణమ్మొనర్చితివేని, యా హ
ఠాద్ఘటనఘాతవిహ్వలితాత్మ నెట్టి
దుర్భరాక్రోశనిర్భర వీక్షణముల
నిన్నతడు గాంచునో మది నెంచుము !

చిత్రాంగద

అటియ
మేలు. ఈ ఛద్మరూపిణికన్న నేన

శతగుణమ్ము శ్రేష్ఠతరమ్ము. దాన నన్ను
నేనె స్వప్రకాశిత మొనర్చుకొనుదాన.
మెప్పు పొందంగ నోడితినేని, ఈస
డించి యాతడు నను వీడిపోయెనేని,
ఎద విదారితమై మరణింతునేని,
ఏను ఏనుగా మిగులంగజాలు; దదియు
మేలొహో, ఇంద్రసఖ!

వసంతుడు

వినుమమ్మ, నాదు
పల్కు. వికసనవిధి పూర్ణమైన వేళ
నే ఫలప్రాప్తి వొడమెడి. కాలనియతి
తాపసంక్లిష్ట లలిత లావణ్యదళము
పోలి వ్రాలు తనంతనే; ఆత్మగౌర
వప్రకాశమ్ములో నంత బయలుపడగ
జాలు దీవు; నీ నైజరూపమ్ము గాంచి,
నూత్న సౌభాగ్యగరిమ బోల్చికొని ఫల్గు
ణుండు ని న్నాదరించుపో! పోగదమ్మ
పొల్గొనగ, వత్సలా!, యౌవనోత్సవమున.

# దృశ్యం: ४

అర్జునుడు—చిత్రాంగద

చిత్రాంగద

ఏమి తిలకించుచుంటి వో వీరవర్య!

అర్జునుడు

చూచుచుంటి నెట్టులు పుష్పవృంతములను
గొని సుకోమల కిసలయాంగుళులు కూర్చు
చున్నవో మాల్యముల; నిపుణతయు చారు
తయు నెటుల సోదరీద్వయమట్లు కలసి
మెలసి యాడెడినో నిరంతరవిలోల
చంచలోల్లాసగరిమ నంగుళుల కన్న
మున్నుగా మున్నుగా. చూచుచుంటి, తలచు
చుంటి.

చిత్రాంగద

ఏమి తలంచుచుంటివో ?

అర్జునుడు

తలంచు

చుంటి, నంతటి సుందరాంగుళులు సోక

మృదులసంస్పర్శనానురాగరంజిత మ్మొ
నర్చి నా ప్రవాసదినాళి మాలగూర్చు
నొక్కటొకటి ప్రేయసియు నిట్లే యటంచు
అక్షయానందహార మయ్యది మదీయ
శిరమున ధరించి మగిడిచేరుదు గృహ మ్మ
టంచు.

చిత్రాంగద

ఈ ప్రేమమునకు గృహమ్ము కలదో ?

అర్జునుడు

గృహము లేదొకో ?

చిత్రాంగద

లేదు. కొంపో దలంతు
వో గృహ మ్మిద్ది ? పల్కబోకుము గృహమ్ము
మాట— గేహమ్ము చిరవర్షవాసమునకు.
నిత్య మగుదాని గొంపోవనగు గృహమ్ము
నకు. అరణ్యపుష్పము పోలిన్రవాల నే గృ
హాంగణమ్మున పారవై వంగబోదు
వీవు ; అనాదరబుద్ధి నద్దాని వీడ
నగును పాషాణపాళి నిచ్చటనె. దాని
వోలెనే యీ అరణ్యంపుటంతిపురి ని

౫౦(అ)





“ మాలగూర్పు నొక్కటొకటి...”  — పుట: 50

రంతర మదెట్టు లంకురమ్ములు నశించు
నో, కిసలయాళి నేలపాలౌనొ, కేస
రములు వసివాడునో, సుమదళము లెండి
గాసిజెందునో,—క్షణికజీవనవితాన
మిచట పుష్పించు, శుష్కించు నిందె యనుని
మేషము.

దినాంతవేళ మదీయ ఖేల
నమ్ము సాంగమ్ముగా జెల్లినంత రాలి
పోదు నే నిందె, ఈ శతశతసమాప్త
సుఖసమూహ సమాధి నరణ్యవీథి
ఏరుగాని మనమ్మున నెట్టి ఖేద
మేని నాకోసమై పొందబోరు.

అర్జునుడు

అంతి
యే?

చిత్రాంగద

నిజమ్మంతె. ఓ వీరవర్య! దుఃఖ
మేల దాన! సుఖాలసదివస వేళ
నేది హాయిగూర్చునో దాన లాలసుడవు
కమ్ము. సౌఖ్యానుభూతి నెక్కుడుగ నొక్క
త్రుటి నిరోధించి నిలిపితివేని, దుఃఖ

భాజనమ్ముగ మారు. ఏమున్న దది స
మస్తము గ్రహింపు, మెంతకాలమ్ము నిలుచు
నంతకాల మనుభవింపు; మాత్మకాంక్షి
తంపు ప్రాభాతసుముహూర్తమం దెడంద
నెంత కోరికొంటివో దానికంటె మిగుల
నాసపడబోకు సంతృప్తిసంధ్య వేళ.
దినము గతియించె; ఈ మాలికను ధరింపు
మోయి త్వద్గళసీమ. ఓ వీరవర! మ
దీయ మీ శ్రాంతతనువల్లి జేర్చుమోయి
త్వద్యుగళ బాహు బంధనాంతరము నందు.
సడలి మిథ్యానిరానంద జడిమ, సంధి
లెడినిగాత నధరసుఖ సమేళనమ్ము.
బాహుపంజరమ్మున బంధితను బొనర్చి
హత్తుకొనుమోయి, నీదాన నైతి, ప్రణయ
చిరపరాజయ మధుమయక్షణిక మందు.

అర్జునుడు

విను మదే! ప్రియతమ! వనావరణ మవల
దూరలోకాలయమ్మున నారతి కిదె
వేళ గాబోలు, శాంతిశంఖమ్ము మొరసె!

# దృశ్యం: ౫

మదనుడు—వసంతుడు

మదనుడు

ఏను పంచశరుండ నోహో సఖుండ !
ఒకశరమ్మున హాస, మఱ్ఱుపు లిఁకొక్క
శరమునం, దొక్కశరమున నాశ, యన్య
శరమున భయమ్ము, తుదిశరమ్మునను విరహ
మేళనములు, నాశానిరాశలును, దుఃఖ
సుఖము లన్నియు నొక్కనిమేష మందె.

వసంతుడు

శ్రాంతు డేను, విశ్రాంతినోసంగుము సఖ!
హే యనంగ! భవద్రణరంగ మింక
సాంగము నొనర్పమోయి. రాత్రిందివములు
చేతనత నిల్పికొని త్వత్ హుతాశన ప్ర
దీప్తి నెంతకాలము వ్యజనమ్మొనర్ప
జాలు దేను! ఇంక నా కన్నుదోయి నిద్ర
ముంచుకొని వచ్చుచున్నది, తూలి వ్రాలి
పోవుచున్నవి పక్షముల్, మ్లానమై ప్ర
తప్త దీప్తిపుంజము భస్మరాశి నడగ

నున్నయది. కూర్కు మేల్కొని కలత దేరి
ఎట్టులో నూతనశ్వాస మూది నవన
వోజ్వలతగూర్ప యత్న మొనర్చుచుంటి.
ఇంక సెలవొసంగుము సఖా!

మదనుడు

ఎరుగు దేను,

అనంతచంచలా, చిరబాలకా! ఒనర్చు
చుందు వీవు ద్యులోకభూలోక మధ్య
మందు బంధనరహితుండ వగుచు ఖేల
నమ్ము. ఎవ్వారి నేకాంతచిరతర ప్ర
యత్నఫలముగ సౌందర్యశోభితుల నొ
నర్తు వవ్వారినే క్షణికమ్ములోన
ధూళితలమున విడనాడి పోవజూతు
వించుకయు వెన్కజూడకే. ఎంచిచూడ
మిగులుదివసమ్ము లింక నెక్కుడుగ లే, వ
నంతచంచల దినజాల మతులవేగ
మున నెగసిపోవుచున్న వెయ్యేడకో త్వదీయ
చాలితగరుత్సమీర ణోద్ధూతము లయి,
రివ్వుమని పరిచ్యుతపల్లవాళి బోలి ;—
హర్షవశత నింతనె వత్సరమ్ము నరుగు!

# దృశ్యం: ౬

అరణ్యమున అర్జునుడు

అర్జునుడు

నిద్రనుండి నే మేల్కాంచినంతనే ప్ర
భాతమున స్వప్నలబ్ధ మమూల్యరత్న
మొందు చేజిక్కినట్టు లైయుండె. దాని
నునుచుటకు నిద్ధకాత్రలమ్మున నొకింత
ఇరవు కనిపించదు : అద్దాని పొదివి యునుప
దగు కిరీట మెయ్యెడనైన గలుగదు ; అదియు
కూర్పనగు సూత్రమును నలభ్యము ; గిరాటు
వైచి దాని పోజాలు నరాధముండ
నెట్లు కానగువాడ నే ; నైన దాని
భద్రపరచుటలో చిరదివసరాత్ర
ములు నిరుద్ధమ్ములయ్యె క్షత్రియుని బాహు
యుగ్మ మూరక కర్తవ్యహీన మగుచు.

(చిత్రాంగద ప్రవేశం)

చిత్రాంగద

ఏమి తలపోతువో !

అర్జునుడు

తలపోయుచున్న

వాడ మృగయావినోదసందర్భ మొందు.
చూడు మల్లదే, పర్వతోపరితలమ్ము
నుండి పల్లమ్మునకు దిగజారె వృష్టి
ధార. క్రమ్మె నరణ్యమెల్లెడ ప్రగాఢ
మై ఘనచ్ఛాయ. కెరలి యుప్పొంగు నిర్ఝ
రిణి కలస్వనగర్వాట్టహాసమున త
టమ్ము లొరసి పారెడి నవహేళనమున.
ఇట్టి వర్షర్తు దివసమ్ములనె మదీయ
భ్రాతృపంచకమును గూడి చిత్రకాట
వీ స్థలమ్మున వేటకై బయలువెడలు
వారము. ఆతపహీన స్నిగ్ధాంధకార
మున దివసమెల్ల నుత్సాహపరత గడపు
వారము. గభీర మేఘమంద్రారవమ్ము
చెవిని బడినంతనే హృదయమ్ము నృత్య
కేళి దేలెడిది ; అల వృష్టివారిముఖర
నిర్ఝరకలస్వనమ్మున సావధాన
ముగ వినంగజాలకయుండె పాదశబ్ద
ముల మృగావళి ; శబలచిత్రితము వ్యాఘ్ర
మును తదీయ పంచనఖాళి చిహ్నరేఖ

లునిచి పథపంకమున తదావాసవాటి
కను బయలువెట్టుకొనుచుండె; కేకరావ
ముల బ్రతిధ్వనిత మ్మరణ్యమ్ము. వేట
ముగిసినంత సోదరపంచకమును పండె
ముల జరచి, నీట జొరి ఈతలాడి, సంత
రణ మొనర్చువారలము వర్షర్తుభాగ్య
గర్వవిస్ఫీతమౌ తరంగిణి. అదే వి
ధాన నీనాడు మృగయార్థ మే వెలువడ
గోర్కె యిగురెత్తె.

చిత్రాంగద

ఓ వేటకారి, నీవు
మొదలిడితి వెట్టి మృగయావినోదము నది
తొలుత సంపూర్తి యొనరింపు మోయి. నీకు
చేతజిక్కె నీ స్వర్ణ మాయామృగమ్ము
సుస్థిరమ్ముగ నంచు భావించితివొకో?
కాదుకా దెన్నటికిని. ఆ వన్యహరిణి
తన్నుదానె ఒక్కెడె నిల్వరించుకొనగ
జాలనిది. సచకితమయి స్వప్నసదృశ
ముగ నెపుడు పారిచనునొ ఎవ్వారి కెరుక.
క్షణిక ఖేలనోల్లాసి, వహింపజాలు
నెట్టు లిది చిరదివసపాశమ్ము. చూడు

మల్లదే, ఎట్లు క్రీడించు నదియు వాయు
లహరి, వృష్టిజలస్రోతముల,—నిమేష
మాత్రమున శ్యామవర్షర్తుదేవి వాయు
పృష్ఠమున వాడి శరసహస్రమ్ము గాట
నేసె, నైన దుస్సాహసియైన మత్త
హరిణ మది యక్షయమజేయమైన రీతి
బరుగులనువారు ;—నీనాడు మధ్యమునను,
నాథ, తద్వీధినే ఖేలనమ్ము నేటి
వర్షదిన వేళ—ప్రాణమ్ము పందెమొడ్డి
వేటలాడుము చంచలాలతనె. శరము
లెన్ని, యస్త్రమ్ములెన్ని తూణమున గల వ
వన్ని ఏకాగ్ర నిస్తులావేశపరత
వర్షణ మొనర్పుము—ఒకప్పు డంధకార,
మింకొకప్పుడు సచకితాలోక హాస
పులకితోల్లాసము ; అంతలో స్నిగ్ధ వృష్టి
పాత, మింతలో దీప్త వజ్రజ్వలనము—
పరుగువారు యథేచ్ఛ మాయామృగియును
జలధరాచ్ఛన్న మీా జగన్మధ్యమందు
బంధనవిహీనమై చిరదివసపాళి.

# దృశ్యం: 2

మదనుడు—చిత్రాంగద

చిత్రాంగద

ఓయి మన్మథా! మత్సర్వదేహమున న
దెట్టి తెలియగారాని దివ్యాంజనాను
లేపన మొనర్చితివో, తీవ్రమదిర వోలె
మిశ్రమై రక్తమున సమున్మాదపరచు
నెడద. నిజగతిగర్వితమత్తమృగియు
వోలె నే ముక్తకేశమ్ము లెగురవైచి
పరుగులను వారుచుంటి, నుచ్ఛ్వసిత రూప
మున నిలాతలి లంఘించుచున్నదాన.
ఘనధనుర్ధరు నంబుదశ్యాము నస్మ
దీయు నీ మృగవ్యాధు నత్యంతముగ నొ
నర్చియుంటి పరిశ్రాంతు వనవనాంత
ముల పథపథమ్ములను గ్రొప్పదులను బెట్టి.
నిర్దయత విజయసుఖానుభూతి గాతు
కప్రకాశహాసోల్లాస గరిమ నుంటి.
భంగమునొనర్ప నీ ఖేలనమ్ము భీతి
వొడమెడి నెడంద; నొక్క నిమేషమేని

సుస్థిరత నిల్వరించిన, హృదయతటుల
నొరయు క్రందనస్రోత ముప్పొంగి పొరలు.

మదనుడు

ఉడుగు మది. భంగమొనరింప దగదు ఖేల
నమ్ము. ఇది మదీయు మీా కేళి. చిటిలి పెటు
నిమ్ము శరజాల, మెద ప్రీలి పగులనిమ్ము.
నాదు మృగయావినోద మీానా డరణ్య
మధ్యమున, నవ వర్షాగమోద్యమమున.
ఇంతలింత లాతని పరిశ్రాంతు జేయు
మీా ; దృఢతరమ్ములగు పాశముల నిబద్ధు
జేసి నీ పదానతునిగ జేసికొమ్ము.
చూపుబోకు మించుక దయ !—హాసజాల
ముల నతని జర్జరితగాత్రు జేసివైచుము.
అమృతవిష సిక్త ఖరవాక్శరప్రవర్ష
ణమున వక్షమ్ము గాటజేయుము. విధాయ
కమ్ము కాదు దయార్ద్రభావమ్ము వేట.

# దృశ్యం: ౮

అర్జునుడు—చిత్రాంగద

అర్జునుడు

నీదు గృహ మెయ్యెడను లేదొకో ప్రియా! త్వ
దీయ బంధుజనాళి భవద్వియోగ
బాధ నాక్రందన మొనర్చు భవనవాటి!
త్వన్నిరంతర స్నేహసంసేవనముల
నెట్టి యానందధామమ్ము నమృతమయ మొ
నర్చి, అంతలో తత్ప్రదీపమ్ము నార్పి
చేరికొంటివో ఈ యరణ్యాలయమ్ము,
అదెందు నీ శైశవస్మృతిజాల మీవు
లేమి దిరుగాడు నార్తి నా నెలవు?

చిత్రాంగద

అడేల

నట్లు ప్రశ్నింపగా నీకు? ఎట్టి లోప
మొదవజోలు నీ యానందలోకమందు!
ఎట్టిగతి నీ కనుంగవ గట్టియుంటి
నదియ నే నౌదు. అంతకు మించి పరిచి
తమ్మొనర్ప నేమియు లేదు. కాంచు మచటి

కింశుకకుసుమజమున నొక్క పల్లవాగ్ర
భాగమున వ్రేలియుండు ప్రభాతశిశిర
కణ మొకండు; తన్నామధామము లెఱుంగ
నగునొకో? వాని దా దెలియంగ గోరు
వారొకో ఎవ్వరేని ఎందేని? నీవు
నేరి ప్రేమించుచుంటివో తాను నట్టి
నామధామవిహీన మైనట్టి శిశిర
కణ సమానము.

అర్జునుడు

పృథ్వీతలాన నెట్టి
బంధనమ్మని లేదొకో తనకు? నూర
కే ధరాస్థలి స్వర్గమ్మునుండి యొక్క
బిందుసదృశమ్ముగా రాలిపడియెనొక్కొ?

చిత్రాంగద

అది నిజము. కేవల మ్మొక్క నిమిషమాత్ర
మాత్మరోచిస్సునం దీ యరణ్యకుసుమ
పుంజము నొనర్చె నుజ్వలతరము.

అర్జునుడు

దాన,
సతత మెద నాహరించి, హరించి, తృప్తి

నొందు, దించుకయును శాంతి గనదు. ఓ సు
దుర్లభా!, కాగదే ఇంకనింక చేరి
కగను నామధామమ్ముల, గోత్రగేహ
ములను, వాక్యదేహమనమ్ములను, ప్రియా!, స
హస్రపాశబంధనముల జిక్కువడి; స్పృ
శింపజాలుదు నిను నాల్గు పార్శ్వములను
చుట్టుకొని యంత, నిర్భయనిర్భరముగ
నిలువనగు నాకు. నామమ్ము లేదటందు
వో, జపింతు నే ప్రేమమంత్రమ్ము తావ
కీన హృన్మందిరాంతరమందు? లేద
టందువో గోత్రము, అయిన, నీ కమలపుష్ప
మే మృణాళమ్మునందు సంధించి నిల్పు
కొనగజాలుదు తలపోసికొను మెడంద.

చిత్రాంగద

కాదుకా దెన్నటికి కాదు. దేని నీవు
బంధితమొనర్ప గోరుచున్నావో దాని
కెరుకలే దెన్నడే నించుకేని బంధ
నమ్ము. అది కేవలమ్ము మేఘాంచల ప్ర
దీప్త హేమచ్ఛటాసమానమ్ము, కుసుమ
గంధ సదృశమ్ము, చల తరంగగతిసమము.

అర్జునుడు

అట్టిదాని ప్రేమించినయట్టివాఁడ
భాగ్యుఁడే యగు. మత్ప్రియా! ప్రేమహస్త
మెత్త నాకాశకుసుమ మ్మొసంగబోకు.
సుఖముననుఁ దుఃఖమున, శుభదినమునందు
దుర్దినమ్మున హృత్పేటి దాచికొనఁగ
దగు నిధాన మీ వొసగుము.

చిత్రాంగద

ఇంక నొక్క

వర్షమేని గతింపక మున్నె, ఇంత
లోననే శ్రాంతుఁడైతి కాబోలు? అక్క
టా, తెలిసికొంటి నిప్పుడు, పుష్పజీవ
నమ్ము నల్పాయువుపొనర్చు టదియె దేవ
తాప్రసాదిత మాశీఃఫల మ్మటంచు.
గతవసంత మృతసుమాళి గలసి మామ
కీన మోహనగాత్రమ్ము నేలవ్రాలి
యుండెనేని, ఆదరపాత్రముగ గతించి
యుండెడిది. ఐన, పార్థ!, ఎక్కుడుగ నింక
లేవులే మిగులు దినమ్ములు; ఉన్నవరకు
ఆశ సంపూర్ణముగ తృప్తిచేసికొని, కు
తూహలాన తదానంద మధురసమ్ము

కలిగినంత నిశ్శేషమ్ము గాగ గ్రోలుము.
అటుపిదప నింక సంస్మృతికుహకమునను
బడి వెనుకజూడగాబోవు గతదినాంత
సంధ్య వృంతచ్యుతమ్మైన మాలతీసు
మమ్ము నాసించు తృషితభృంగమ్ము మాడ్కి.

# దృశ్యం: ౯

వనచరగణము—అర్జునుడు

వనచరుడు

అయ్యయో! అక్కటా! రక్షణమ్మొసంగు
వా రెవరు?

అర్జునుడు

భీతిహేతు వదేమి?

వనచరుడు

ఉత్త

రంపు పర్వతప్రాంతమ్ము నుండి దస్యు
దళము దండెత్తి వర్ష కాలంపు గిరిని
పాతవన్యాసమాన జవమ్ము తోడ
లోకనాశమ్మొనర్పగా తరలి వచ్చు
చున్నవారలు.

అర్జునుడు

ఈ రాజ్యమునకు రక్ష
కులగువార లెవ్వారు లేరేమి?

వనచరుడు

రాజ

కన్య చిత్రాంగదాదేవి దుష్టదమన
కలదు ; తద్భయమ్మున రాజ్యమున నికెట్టి
భయమునకు తావులేకుండె యముని భయము
తక్క. ఆయమ తీర్థపర్యటన కేగె
నంట యజ్ఞాతయాత్రావ్రతమ్ము కతన.

అర్జునుడు

రక్షణమ్ము ఈ రాజ్యమ్మునకును ఒక్క
రమణియా ?

వనచరుడు

అనురక్త ప్రజాదరమున
నేక దేహాన పితృమాతృతుల్య యామె.
ఆమె యగు రాజమాత స్నేహార్ద్రభావ
మందు, వీరత్వమున యువరాజమూర్తి.

[ప్రస్థానం]

(చిత్రాంగద ప్రవేశం)

చిత్రాంగద

ఏమి భావించుచుంటివి, నాథ ?

అర్జునుడు

ఏల

నో తెలియకే తలంచుచున్నాను రాజ
కన్య చిత్రాంగదనుగూర్చి మనమునందు ;
అనుదిన మ్మామెకథనమే వినగనయ్యె
శతముఖమ్ముల నవనవాపూర్వగాథ.

చిత్రాంగద

ఆమె కుత్సితమతియు, కురూపి! ఆమె
భ్రూయుగమ్మిట్లు వక్రసుందరముకా ద
దెంతయును నిబిడతమిస్రకాళిమమ్ము.
కఠినతర మామె సబలబాహువు గడించె
లక్ష్యభేదనవిద్య తా, నైన వీర
గాత్ర మిట్లు సుకోమలనాగపాశ
మున నిబంధించు నేర్పరితనము లేదు.

అర్జునుడు

కాని, వినియుంటి స్నేహభావావ నారి
యును, పురుషతుల్య మామె వీరత్వమం ద
టంచు.

చిత్రాంగద

ఇసీ! ఆమె మందభాగ్య మ్మదేగ
దా! తరుణి కేవలమ్ము తారుణ్యరూపి

ణిగ, ధరాతలశోభగా, కాంతిరూపి
ణిగ, ప్రణయమూర్తిగా సుమధురఫలమ్ము
తోడ శతరూపభంగిమమ్ముల వెలార్చి,
ప్రతినిమేషమ్ము పరుగులువారి, చుట్టు
కొనుచు నల్లిబిల్లిగ ప్రాకులాడి, హాస
శోకబాష్పమ్ములోడ్చి, సేవచమొనర్చి,
ప్రీతిభావమ్ము వెలిజిమ్మి, చేతమలర
నిత్యము చరింపజాలుటే జన్మసార్థ
కత్వమగు నామెకు. ఏమి లాభమ్ము కలుగు
కర్మకీర్తుల, వీర్యబలమ్మునను, సు
శిక్షణమ్మున, దీక్షాప్రశస్తి కలన
నామెకు? ఓ పౌరవోత్తమా! గతదినాన
నా వనపథాంచలాన, పూర్ణానదీ త
టాన, నా దేవతాలయాంతరమునందు
ఆమె నీ కంటబడియున్న నపహసించి
వైదొలగిపోదు వనుట నిక్కువము. అక్క
టక్కటా! నేడు నీ కెంత యరుచివొడమె
నోయి సుందరనారీత్వమందు, పురుష
కారమాధురి నారీత్వమున గనంగ
గోరుచున్నావు!

హే మనోనాథ, రమ్ము!
చూడు మల్లదే శైలగుహాముఖమ్ము
నావరించె ఘనచ్ఛాయ, యచటనే ర
చించియున్నాను మనదు మధ్యాహ్నశయన
తల్పమును శ్యామలసువర్ణ నవ్యకిసల
యాళి గిరిఝరీశీకరనికరముల స
మార్ద్రము నొనర్చి. క్లాంతకపోత మదె గ
భీర పల్లవచ్ఛాయ దా గూరుచుండి
రుద్ధకంఠమ్ముతో కూయి వెట్టె, 'కాల
మరుగు', 'కాల మ్మరుగు' నంచు. కలకలస్వ
న మ్మొలికి మెల్ల ఛాయాతటమ్ము నొరసి
చల్లగా ప్రవహించె నదీమతల్లి.
సరసమసృణ సుశ్యామల సిక్తకోమ
లమ్ము శైవాలజాలమ్ము మంజులాధ
రమ్మున పదేపదే శైలఖండనయన
పాళి చుంబనమ్ముల జిల్కరించి పోలె.
రాగదే నాథ!, విరళవిశ్రాంతి బవ్వ
ళించి కాలమ్ముబుచ్చ.

అర్జునుడు

రాజాల నేడు
మత్ప్రియా!

చిత్రాంగద

ఏల నో మనోనాథ!

అర్జునుడు

వింటి,

దస్యుదళమొండు దిగెడి నాశము నొనర్ప
జనపదమ్ముల వని; భీతజనుల రక్ష
ణమ్ము జేకూర్పగావలె.

చిత్రాంగద

ఇంచుకేని

లేదు భయహేతు వో ప్రభూ! తీర్థయాత్ర
వేళ సాలోచనమ్ముగా నేర్పరించె
నలుదిశల గాపొనర్పగా ప్రహరిదళము
రాజకన్య చిత్రాంగద. రాగలట్టి
యాపదల దారులెల్ల సతర్కితముగ
బంధితమొనర్చి పోయె.

అర్జునుడు

ఆనతి యొసంగు

మైన, మత్ప్రియా!, స్వల్పకాలమ్ములోన
మగిడివత్తు కర్తవ్యసంధానమును పొ
నర్చినంతనె. బహుదినమ్ములుగ నలస

భావమున బడియుండె నీ క్షాత్రబాహు
వో సుమధ్యమా! కీర్తివిక్షీణ మీ భు
జద్వయమ్ము పునర్నవగౌరవ ప్ర
పూర్ణము నొనర్చి ప్రీతమ్ముగా త్వదీయ
మస్తకతలమ్మునందున నునిచి, తావ
కీన యోగ్యోపధానమ్ముగాగ జేతు.

చిత్రాంగద

నేను పోనానతీనిచో? బందిజేసి
యునుపుచో?—బంధనముల విచ్ఛిన్నముగ నొ
నర్చి పోజాలెదో! అట్లయేని పొమ్ము.
కాని మరువకు మీమాట, మరల మేళ
నమ్మున కలభ్యమగును విచ్ఛిన్నలతిక.
ఎడద సంతృప్తి నిండెనా వెడలిపొమ్ము,
ఆపగాబోను. తృప్తి సంపూర్తి కాని
యెడ, మదీయవచస్సత్య మరయుమోయి.
చంచలము సుఖలక్ష్మి, తా నించుకేని
నేరికొరకేని యొక్కచో నిలువబోదు;
ఏరికేని ఆయమ సేవజేయు దాసి
గాదు; కన్నులు కాయలుకాయ భీతి
భావమున నరనారీజనాళి యామె
సేవన మొనర్తు రారజనీదివమ్ము,

ఎంతకాల మాయమ సుప్రసన్నమగునో
యంతకాలము. ఎవ్వారు సుఖంపు కోర
కమ్ము దిగవిడి పోజూతు రట్టివారు
కర్మరంగమ్ము వీడి సంధ్యావసాన
మున మగిడివచ్చి తా బరికించునంత,
తన్ముకుళ మింతలో విచ్చి దళములెల్ల
ధూళి వసివాడి రాలిపోజూచి పరిత
పింపగా నగు కర్మసర్వస్వమును ని
రర్థకమ్ముగా నెద దలపోసి; నిలిచి
పోవు నాజన్మమై క్షుధాతురముగా న
తృప్తి జీవనమధ్యమ్మునందు చిరది
నమ్ము.

రారమ్ము, హే మనోనాథ! రమ్ము.

ఏలనోయీ పరధ్యాన మింత నేటి
వేళ? ఎవ్వారి నెంచి తలంపులూరె
నెడద? చిత్రాంగదను తలంతువా? అదేల
నేటిదిన మింత భాగ్యమ్ము నోచె నామె?

అర్జునుడు

భావనము సేయుచుంటి నే కారణమున
నట్టి వీరాంగనయును చేపట్టవలసె..

నంత దుష్కర వ్రతదీక్ష ? ఆమె యెడద
గలుగబోలు నభావ మెయ్యదియొ ?

చిత్రాంగద

ఆమె

లో నభావ మేమందువా ? ఆ యభాగి
నికి గలిగియున్న దెయ్యది ? అభ్ర భేద్య
దుర్గసన్నిభముగ చతుర్దిశల బొదివి
రుద్యమాన తద్రమణీహృదంతికము ని
రుద్ధము నొనర్చె నాయమ వీర్యబలము.
రమణి సహజమ్ముగా నంతరంగవాసి
ని యగు ; సంగోపనమ్ముగా నాత్మలోన
మరుగువడి యుండు. ఆయమ హృదయబింబ
మంగళోభా ప్రకాశితమై వెలుంగ
కున్న నెవ్వార లామె గాంచంగనోపు
దురు !—— అభావ మేమందువా ఆమెలోన !
అరుణ లావణ్యశోభ గోల్పడు నుషాస
మానమై, నిజ దీర్ఘప్రవాస తిమిర
లోకమందు నేకాకియై, వీర్య శైల
శృంగమున శృంఖలాబద్ధమైన రమణి
లో నభావమ్ము దెలియంగ గోరువాడ
వో !——ఉడుగుమోయి, చాలు, నాయమ చరిత్ర ;

పురుషులకు శ్రుతిమధురమ్ము కాదు తత్క
థా విధానమ్ము.

అర్జునుడు

ఇంకను పల్కు మామె

గాథ. విన్నకొలంది పొంగారె లోన
శ్రవణలాలస : హృదయాంతరమున నామె
హృదయ మెట్టిదో అనుభూతి యొదవుచుండె.
పాంథుడే నర్ధరజనీతమిస్రమున న
డెట్టి యపరూపదేశమ్మునందొ జొచ్చి
పోవుచుంటి గాబోలు నన్నట్లు తోచె.
వాహినీ గిరి వనభూములెల్ల సుప్తి
మగ్నములు, శుభ్ర సౌధకిరీటిని యగు
నే విశాల నగరవాటియో మదీయ
మానసమ్మున ఛాయాసమాన మగుచు
గానుపించు నర్ధస్ఫుటమ్ముగ, శ్రవోయు
గమ్మున ధ్వనించు సాగరగర్జనమ్ము ;
నాల్గుదిక్కులొక్కటన విచిత్ర విస్మ
యమ్మొనర ప్రస్ఫుటమ్మగు సరణి దోచు
నీ ప్రభాతప్రకాశమ్ము లోన ; నామె
కై సముత్సుక హృదయాన నే ప్రతీక్ష

నెదురుచూడంగ బోలు, తత్కథన మింక
నింక విన గోర్కెలూరె, డెల్పుము మరింత!

చిత్రాంగద

ఇంక నేమి వినంగ గోరుదువు?

అర్జునుడు

కనుల

గట్టిన ట్లుండె, హాయపట్ట మామె వామ
కరమున ధరించి, అవహేళనమున దక్షి
ణ కరమందు ధనుశ్శరమ్ములను గొని, ప్ర
హృష్టనగర విజయలక్ష్మి భాతి నార్త
జనగణమ్ముల కొసగుచు నున్నయట్లు
గా వరాభయదానమ్ము. రాజమహిమ
మెయ్యెడ వినీతమై ప్రవేశమ్ము బొందు
నట్టి దీనదరిద్ర సంకీర్ణ ద్వార
సీమ మాతృస్వరూపమ్ము దాల్చి వితర
ణ మ్మొనర్చు కారుణ్యభావమ్ము నామె.
సింహినియువోలె నలువైపులను తదీయ
వత్సగణముల నుత్సంగమున గదించి,
శత్రుభీకరముగ నిల్చి, ముక్తలజ్జ
యును భయవిహీనయును సుప్రసన్నహాస
వదనయును నయి విహరించునట్లు తోచు,



"మత్తహయయుగారూఢుల మగుచు..."

—పుట : 77

నా దయామయి వీర్యసింహాసనాధి
రూఢయగు నా జగద్ధాత్రియో యనంగ.
రమణి కమనీయ బాహుద్వయాన నామె
దగు నసంకోచబలము స్వాధీన మగుచు
నిరవుకొనె; దానిపజ్జ గౌరవము పొంద
జొదు కింకిణీకంకణ క్వణరవమ్ము.
రమ్మిటుల నో వరారోహ!, బహుదినమ్ము
లుగ మదీయ మీ ప్రాణము కర్మహీన
మై యిపు డశాంతమయి మేలుకాంచె, దీర్ఘ
శీతసుప్తోద్ధత భుజంగసదృశ మగుచు.
రమ్ము, రారమ్ము! మన మిర్వురమ్ము గలసి
మత్తహయయుగారూఢుల మగుచు పజ్జ
పజ్జగా నతిశయవేగపరత నుజ్జ్వ
లమ్ము జ్యోతిశ్శిఖాయుగళ మ్మనంగ
పరుగువారుద మీనాడు; బయలువెడల
గోర్కెవొడమె, నీ రుద్ధసమీరణమ్ము
తిక్తకుసుమగంధ మదిరాప్రమత్త మీ వి
నిద్రితారణ్య తమసగర్భమ్ము వదలి.

చిత్రాంగద

ఓయి కౌంతేయ! తలపోయుమోయి, ఇట్టి
లలితలావణ్య, మిట్టి కోమలమనోజ్ఞ

మైన భీరుత్వ, మిట్టి పేశల శిరీష
సదృశ సంస్పర్శనక్లేశ కాతరమగు
నీ స్వరూపసౌందర్యమ్ము నీసడించి,
జీర్ణవసన విశీర్ణఖండమ్ము మాడ్కి
పదతలమ్మున విడనాడు నెడ, నోకించు
కేని వెతబొంద కీవు సహింతువొక్కొ?
కామినీజన సహజమ్ములౌ ఛలాక
ళా విలాసముల్ మాయమర్మములు మరచి,
వీర్యవంత మంతర్బలస్ఫూర్తి నిత్య
కుంఠితము లుంఠితము నగు లతికపోల్కి
గాక వాయుభరాన వినమ్రమ సుంద
రమ్మయిన పార్వతీయ తేజోవిరాజ
తరుణ ధరణీజ మట్టుల సరళ మున్న
తమ్మగుచు పజ్జ నిల్చిన, పురుషచక్షు
వులకు నందమ్ముగా దోచునోయి!—చాలు
చాలు, నద్దానికన్న నియ్యదియె మేలు.
రెండునాళ్ల ముచ్చట మైన, నతి యమూల్య
ధనమగు మదీయ నవ్యయౌవన మలంకృ
తమ్మొనర్చి ప్రయత్నపూర్వమ్ము గాగ
గూరుచుండు నెమరుచూచు చూరకే ప
థమ్ము; అవసర వేళ నీ వాగమింప

నాత్మసుధ నెల్ల దేహపాత్రమ్ములోన
నంచులంటంగ పూరించి అర్పణమ్ము
సేయుదాన గ్రోలంగ నద్దాని నీవు.
సుఖ రసాస్వాదనమ్మున శ్రాంతినొంది
పోవనగు నీకు కర్మసంధానమునకు.
అంత వృద్ధాప్య మదియు ప్రాపింప నెందో
సంగెదో స్థాన మీ వందె యుందు నొదిగి
పార్శ్వతలమున. తలపోయు మొక్కమాట,
యామినీ నర్మసహచరియైన ముగుద
కర్మసహచరిగా పజ్జ గడపి దినము,
దక్షిణకరానుసారిణి వామహస్త
మట్లు నిరతమ్ము సమ్ముఖవర్తినిగ చ
రించుటది వీరవరు హృదయాంతరమున
కెక్కుడు ముదమ్ముగూర్చునా?

అర్జునుడు

ఎరుగజాల

కంటిని భవద్రహస్య మేను; ఇన్నినాళు
లున్న నొక్కించుకేని పారమ్ము చిక్క
కున్నయది. హృదయమ్ము గుప్తమ్మొనర్చి
నన్ను వంచన మొనరించుచున్నదాన
వీవు బోలు. దేవతవోలె నీవు దాగి
యుండి ప్రతిమాంతరాళమ్మునుండి నా కొ

సంగుచుంటి వమూల్యచుంబన వినూత్న
రత్నమణిగణ, మాలింగనామృతమ్ము,—
కొనవు నీ వించుకయు, కోరికొనవు గూడ.
అంగహీన ఛందోహీనమైన ప్రేమ
మనుని మేషమ్ము పరితాప మంతరాన
మేలుకొల్పు. తేజస్వినీ! తావకీన
పరిచయ మ్మిసుమంత చొప్పడెడి నప్పు
డప్పుడెండెందొ; తత్సమక్షమునయందు
తలప నీ మృదుసౌందర్యరాశి మృత్తి
కాఘటితమూర్తి బోలు, నైపుణ్యచిత్రి
తమ్మయిన శిల్పయవనికా సదృశమగును.
త్వత్స్వరూపమ్మె ని న్నవధారణ మ్మొ
నర్పగా నోడి నిలువెల్ల ఝల్లురన ప్ర
కంపితమ్మయి చలియించునట్లు తోచు
నెమ్మది నొకప్పుడు; అశ్రుస్రవంతి నిత్య
దీప్తహాసాంతరావాసి యగుచు నంత
నింత నిర్ఝరపాతమై యంచులొరసి
పొరలి యుప్పొంగనున్న యట్టులుగ దోచు.
సాధకుని కన్నుదోయి మాయాస్వరూప
మై మనోహరవిభ్రాంతి వొడమి మొదల,
పిదప నిరలంకృతాకృతి నంతరమ్ము

లోన బాహిరమున దీప్తివంతమగును
సత్స్వరూపమ్ము. తద్వ్యధి త్వద్హృదంత
రాళ సత్యమ్ము నా కొనగూడ జేయు,
మటులె చేకొను మస్మదాంతర్య సత్యము,—
అట్టివేళన మప్రశాంత, మది చిరంత
నమ్ము. అదేల నశ్రులు మత్ప్రియా! ముఖమ్ము
కరతలమ్మున గప్పి వ్యాకులత బొంద
నేల? వ్యథ గొల్పుచుంటినో కో, ప్రియతమ;
వలదువల దట్టులైన; మత్పుణ్యఫలమ
టందు నీ మోహినీస్వరూపమ్ము—అదే వి
నంగనగు నంతనింత నానందగీత
మీ వసంతసమీర వీచికల దేలి,
మధుర యౌవనయమునా సుదూరతీర
మురళికారుతి, మన్మహాభాగ్య మదియ!
మామకీన హృదంతరావేదనమ్ము
సౌఖ్యమునకన్న నతిశయసౌఖ్య, మాశ
కన్న నుత్కృష్టతర మహదాశయమ్ము,
హృదయమునకన్న ఘనతర మదియుగాన
మది గలంచు, ప్రియా!, వ్యథాకృతి ధరించి.

# దృశ్యం: ౧౦

మదనుడు—వసంతుడు—చిత్రాంగద

మదనుడు

నేడిదే శేషరాత్రి.

వసంతుడు

ఈనాటి రేయి

సాంతమైనంత నే త్వదీయాంగశోభ
తిరిగి చేర్తును నక్షయమ్మయిన యా వ
సంత భాండారమందున. మరచి పార్థ
చుంబనస్మృతి నీ యోష్ఠరాగ మగును
కిసలయాంకూరయుగళిగా లతికలందు.
నీ తనుచ్ఛాయ శతసితప్రసవపాళి
నూతనోద్భూతమై గతజన్మగాథ
మరచు నవజాగృతిని స్వప్నకథ విధాన.

చిత్రాంగద

అతులమయిన నో యనంగ!, ఓహో వసంత!,
నేటిరాత్రి మదీయ ముమూర్షురూప
మిది హతాత్ప్రోజ్జ్వలమ్మయి ఎసగుగాత,

శేషరజనీ పరిశ్రాంత దీపకళిక
నెగయు నంతిమ దీప్తకేలిక విధాన.

మదనుడు

అయిన నగుగాత నట్టులే?,— మత్సఖుండ,
ప్రాణపూర్ణ వేగమ్మున మలసి వీచు
మోయి దక్షిణపవనమ్ము, యౌవనంపు
క్లాంత మందనిస్రుతి నవోల్లాసగరిమ
నంగకమ్ముల మరల నుప్పొంగుగాత!
నేను మత్పంచపుష్ప శిలీముఖాళి
నీ నిశీథ నిద్రాభేదన మ్మునర్చి
భోగవతివాహినీ తుంగభంగ శీక
రాళి నాప్లావిత మొనర్తు బాహుపాశ
బద్ధ ప్రేమికయుగళ దేహమ్ము నంత.

# దృశ్యం: ౧౧

అర్జునుడు—చిత్రాంగద

శేషరాత్రి

చిత్రాంగద

కోర్కె సంతుష్టమాయెనా కో ప్రభూ!, మ
దీయ సౌందర్యశోభ లావణ్యఘటిత
మదియు సితనవనీతసుకోమలమ్ము,
దాన గల్గు సుగంధమ్ము స్వాదుమధుర
సమ్ము సర్వమ్ము గ్రోలంగజాలితో? ఒ
కింత యింకను మిగిలియుండినదొ? ఇంక
గోరుదో యిసుమంత! నాలో నదెంత
కల్గె నంతయు నిశ్శేషమాయెనో కొ-!
లేదులే దింక నో ప్రభూ!, స్వాదువైన
స్వాదుతారహితమ్మైన నేది మిగిలె
నది సమస్త మర్పింతు నీనాడు నీకు.

ప్రియతమా! నీకు సంతోషకర మటంచు
మది దలంచి, యీ సౌందర్యకుసుమరాశి
బహుళసాధనాపూర్వకమ్ముగను గ్రుంచి
తెచ్చి నందనకాననకుంజతతుల,
త్వత్పదాంభోజమున సమర్పించియుంటి.

పూజ సంపూర్ణమైనచో నాజ్ఞయొసగు
మో ప్రభూ!, మాలికలు లేని పూలసజ్జ
నాలయమ్మున కావల పారవైతు.
ఇంక నొకపరి ఈ దాసివంక జూడు
మోయి నీ సుప్రసన్నవీక్షణము బరపి.
ఎట్టి సుమజాలమున పూజన మ్మొనర్చి
నానొ నే నట్టి సుమశోభ నెరుగ నెపుడు,—
అంత మాధుర్య, మంత కోమలత, అంత
పూర్ణసౌందర్య మో ప్రభూ!—లోన గలవు
దోషగుణములు, పాపపుణ్యములు, దైన్య
తయు, నసంతృప్త మాజన్మతృష్ణ. నేను
జీవితపథాన నొక పాంథురాల, ధూళి
లిప్తవాసిని, విక్షతచరణయుగళ.
కుసుమలావణ్య, మీ క్షణద్వయవిభగ్న
జీవనస్వచ్ఛశోభ, యెచ్చో లభింప
గానగును నాకు! ఐన, నాలోన గలుగు
నక్షయామర మొక రమణీహృదయము!
దుఃఖము, సుఖమ్ము, ఆశ, భయమ్ము, లజ్జ,
దుర్బలత, ధూళిమయి ధరాదేవి గర్భ
జనితసంతాన,—మిందుల నిముడు నెంత
భ్రాంతి, ఎంత హృదివ్యథ, ఎంత వలపు;

సర్వ మేకానుభూతి సమ్మిశ్రితమ్ము.
కలుగు నాలో నపారమగా నప్రపూర్ణ
తయు, ననంతమగా నోక మహత్వమ్ము గూడ.
కుసుమసౌరభ మిం దొకించుకయు మిగిలె
నేమొ, ఒకపరి దృష్టి సారించుమీ త్వ
దీయ జన్మజన్మాంతర సేవికపయి.

[సూర్యోదయం]

(అవగుంఠనము తొలగించి)

నేను చిత్రాంగదను—మహారాజపుత్రి
నేను. స్మృతిపథమ్మున నిల్చియుండ బోలు
నల్లనా డొకప్పుడు ఆ సరోవరంపు
తీరమందు శివాలయద్వారసీమ
కాంచియుంటి వొకానొక కాంత, నతిశ
యాభరణభారనత, రూపహీనగాత్ర.
రహితలజ్జాముఖర యామె, పలికె నేమి
యేమొ; పురుషప్రథానుసారముగ పూజ
న మ్మొనరజేసె పురుషపుంగవు,—అవజ్ఞ
నాయమ తిరస్కృతి నొనర్చినావు నీవు.
మంచిపని చేసితివి గ్రహియించి యుంటి
వేని ఆయమ నట్టి సామాన్యరూప
మునను, తత్కార్య మది యనుతాపశల్య

మగుచు నామరణమ్ము నాయమ హృదంత
రాళమును జీల్చి వేదన పాలొనర్చె
డిది. ప్రభూ! నేన యగుదు నా నారి, నైక
సత్యముగ నామె నేనుగాను; ఆమె నాదు
హీన ఛద్మవేషమ్ము సుమ్మీ!—అనంత
రమ్ము వడసితి నా వసంతుని వరాన
వత్సరప్రాయ మపరూపగాత్ర మేను;
వీరహృదయమ్ము శ్రాంతమ్మొనర్చితిని మ
దీయ ఛలనభరమ్మున,—ఆ స్వరూప
మదియు నే గాను. కేవల మ్మగుదు నేను
రాజపుత్రి చిత్రాంగద. దేవి గాను,
కాను సామాన్యరమణియు నేను. పూజ
లొసగి శిరసావహింపంగ నిచ్చగింతు
వెవత నీ వట్టి ఘనతరయువతి గాను;
హేయభావాన నీరసజీవిగా నొ
నర్చి పోషింతు వెవ్వతె నట్టి దాసి
నేని నే గాను. త్వాత్పార్శ్వసీమ నిలిపి
కష్టజీవితపథ సమవర్తిగా నొ
నర్తువా, దురూహ్య చింతాభరాన పాలొ
సంగుదా, భవత్కఠోర వ్రతమ్ములందు
దోడుగాగ నానతి యొసంగుదా, సుఖమ్ము

లోన దుఃఖాన సహచరిగా మెలంగ
నిత్తువో, నాదు సత్యరూపమ్ము నీకు
పరిచితమ్మగు. మద్గర్భమున ధరించి
నట్టి నీదగు సంతానమదియు నొక్క
పుత్రుడై పొల్చుచో, శైశవాదిగాగ
వీరశిక్షణ మొసగి, ద్వితీయుడర్జు
నుండనగ లోక మే నొకానొకదినమ్ము
పితృపదయుగమ్ము కడకు బుత్తెంచినపుడు,
నాదు కలరూపు తెలియంగనగును నీకు.
ప్రియతమా! నే డిదే నివేదనమొనర్తు
త్వత్పదాంభోజముల ప్రోల కేవలమ్ము
రాజపుత్రి చిత్రాంగదనగుచు ప్రాలి.

అర్జునుడు

మత్ప్రియా! నేడు ధన్యజీవనుడ నేను!

Printed at The Liberty Press, Madras.—Q. H. Ms. 499
for M. Visweswara Rao, T. P. No. E 146. 1000 copies, Jan. 1947.

# నవరచనా ప్రచురణలు

1. జేబురుమాలు : ఇతర కథలు
   రచయిత : శ్రీ బుర్రా వెంకట సుబ్రహ్మణ్యం.
2. కూలిజనం (కథల సంపుటి)
   రచయిత : శ్రీ పాలగుమ్మి పద్మరాజు.
3. చిత్రాంగద (సచిత్ర గీత నాటిక)
   (శ్రీ రవీంద్రుని వంగమాతృకకు అనువాదం)
   అనువాదకుడు : శ్రీ మల్లవరపు విశ్వేశ్వరరావు.

* అచ్చులో *

4. తిలక్ కథలు
   రచయిత : శ్రీ దేవరకొండ బాలగంగాధర తిలక్.

---

## జేబురుమాలు : ఇతర కథలు

రచయిత :

శ్రీ బుర్రా వెంకట సుబ్రహ్మణ్యంగారు.

నవరచనావళి వారు ప్రథమ పుష్పంగా ఇది పాఠక లోకానికి అందమైన కూర్పుతో అందజేశారు. —ఆంధ్రపత్రిక.

ఉత్తమ కథారచయిత. —ఆంధ్రప్రభ.

జీవితంలో కొన్ని ఘట్టాలకు ఈ కథలు సమగ్రమైన వ్యాఖ్యలు. —భారతి.

నవరచనా ప్రచురణలు

4/8, దేశిగర్ సామి వీధి, మైలాపూరు, మద్రాసు

# "నవరచనావళి" గ్రంథమాల

కథ — నాటిక — వ్యాసం —
స్కెచ్ — పద్య నాటిక — గేయ సంపుటి —

విశిష్ట స్వతంత్ర రచన, ఉత్తమ అనువాద రచన—నవరచనలోని
వివిధ స్వరూపాలూ, విభిన్న నైపుణ్యాలూ—
ఈ గ్రంథమాల ఆదర్శంలో ప్రతిఫలితం కావాలని ఆశయం.

సంవత్సరానికి 12 పుస్తక పుష్పాలు
ఈ గ్రంథమాలను అలంకరింప జేయాలనికూడా ఆశయం.

సంపుటి ఒక్కంటికి వెల రు. 1-8-0 కు మించకూడదని ఆశయం.

చందాదారులుగా జేరు సహృదయులకు
సంవత్సరానికి (లేక 12 సంపుటాలకు)
**చందా మొత్తం: రు. 15/-**

అర్థ సంవత్సరానికి (లేక 6 సంపుటాలకు)
**చందా మొత్తం: రు. 8/-**

గ్రంథవిక్రేతలు విక్రయపరతులకు ప్రకాశకులకు
వ్రాయ గోరుతాము.

నవరచనా ప్రచురణలు

సంపాదకుడు, ప్రకాశకుడు:
మల్లవరపు విశ్వేశ్వరరావు
4/8, దేశిగర్ సామి వీధి, మైలాపూరు, మద్రాసు.

